STUDIO Roopkala

అనురూపా వారి

# అనురాగం



డిస్ట్రిబ్యూటర్లు
ఆంధ్ర, సీడెడ్ : విజయ
నైజాం : వాణి

VANTA

దర్శకత్వం
రామినీడు

నిర్మాతలు
టి. హనుమంతరావు
డి. సూర్యనారాయణ

# నేడే చూడండి









# పరువు-ప్రతిష్ఠ

నిర్మాత
జూపూడి వెంకటేశ్వరరావు

ఆంధ్ర. సీడెడ్. నైజాం
వాణీ రిలీజ్

కథ, స్క్రీన్‌ప్లే, డైరెక్షన్:
మానాపురం అప్పారావు

# ఉత్తరాలు

## ముఖచిత్రం

చాలా కాలమునకు ప్రత్యక్షమైన శ్రీ కాంతారావు ముఖచిత్రము నన్ను అమితానందుని చేసినది. త్వరలో "తెరమీద—తెరవెనుక" శీర్షికలో పరిచయము చేస్తారని ఆశిస్తున్నాను.

తుమ్మల రఘునాథ్, (అప్పికట్ల)

**మీ 'ఆశ' త్వరలోనే ఫలిస్తుంది!**

## సీరియల్ కథ

"తామర కొలను" సీరియల్ శ్రద్ధగా చదువుతున్న పాఠకుల్లో నే నొకడిని. ఈ వారం (31—5—63) సంచిక చదివాక ఏమీ బాగు లేదనిపించింది. రత్నకి నిగ్రహాశక్తి ఎక్కువ అని వ్రాసి మళ్ళీ మనశ్శాంతి కోసం వచ్చిన రమేశ్‌తో కలవడం చాలా అసహజంగానూ, అప్రస్తుతంగానూ ఉంది. ఇప్పటివరకు నిర్మలమైన నీరులా ఉన్న సీరియల్‌లో రాయి విసిరినట్లయింది.

కె. రమేష్ (సేలమ్)

## హిప్నాటిజమ్

(24—5—63) ఆంధ్ర సచిత్ర వారపత్రికలో నన్నెక్కువగా ఆకర్షించినదీ, నా సందేహ నివృత్తి చేసిన వ్యాసం 'హిప్నాటిజమ్'. హిప్నటైజ్ చేయువానియందు హిప్నటైజ్ చేయబడిన వానికి ఉండే నమ్మకము మీద హిప్నాటిజమ్ యొక్క తీవ్రత ఆధారపడి యుండు ననునది కల్లగాదు. అది నా అనుభవం ఈ హిప్నాటిజమ్‌నే 'మెస్మరిజమ్' అంటారేమో!

ఎన్ నిర్మల, సుధ (గూడూరు)

## కథలు

'విడాకులు' బాగుంది నవ సమాజ సంస్కృతికి ప్రోత్సాహకరంగా ఉంది. చైతన్యయుతమైన రచనను అందించిన శ్రీ డి. వి. రావుగారికి నా ధన్యవాదాలు. నారాయణంచంద్రశేఖరశాస్త్రి (నారంపేట)

* * *

మన తెలుగువాళ్ళకుండే ఆలోచనా శక్తుల్ని వాటితోబాటు జీవితంలో వేసే తప్పటడుగుల్ని మరొక్కసారి జ్ఞాపకం చేసిన "త్రిపుర" గార్కి, బొమ్మల్లో సంఘటనల్ని చిత్రించిన యువ చిత్రకారులు సుబ్బారావ్ ఉరఫ్ 'శారద' గార్కి అభినందనలు తెల్పుతూ, మరింకెన్నో రచనలు వారి నుండి రాగలవని ఆశిస్తున్నాం. ఆర్క (విజయవాడ)

## తెరమీద - తెరవెనుక

నా అభిమాన ఆంధ్ర సచిత్ర వారపత్రికలో ప్రతివారము ప్రచురించుచున్న 'తెరమీదా తెరవెనుక' శీర్షిక ఎంతో బాగుంటున్నది. అత్యుత్తమ నటుడు శ్రీ గుమ్మడిని గురించి చక్కగా వ్రాసినారు. శ్రీ గుమ్మడి, తను కనిపించిన ప్రతి చిత్రములోను, ధరించిన పాత్రలో లీనమై, అద్భుతముగా నటించినాడనుటలో సందేహములేదు. అఖండ ప్రజ్ఞావంతుడైన గుమ్మడి మున్ముందు గొప్పగా రాణించగలరని ఆశించుచున్నాను.

**పి. దక్షిణామూర్తి (నగ్నూరు)**

హార్లిక్స్ చేసే మంచికి ఒక ఉదాహరణ:

# "నా శాయశక్తులా పనిచేసేనండీ!"

"అబ్బే, యింకా కష్టపడి పనిచేయాలి!"

నా మనస్సు చివుక్కుమంది. క్రొత్త కంపెనీలో పై పదవి సులభముగా వస్తుంది కనుక నేను ప్రమోషనుమీద బదిలీ త్వరగా అవుతుందని ఆశించేను. కాని అధికారి ఆగ్రహంతో నా కోర్కెలు కరిగిపోయేయి.



ఆరోజు రాత్రి నా భార్యతో "ఇదిగో, యివాళనుండి మనకు బదిలీ అన్న మాట అనకు." అన్నాను చిరాగ్గా. ఆమె నిరుత్సాహపడి సాధింపు ప్రారంభించింది. "బాగుంది, మీ వరస. ఆఫీసులో సాధింపు చాలదనా మీ ఉద్దేశం." అన్నాను.



ఆమె యిలా అంది. "చూడండి, నా గురించి నేను అనడములేదు. చాల వారాలనుండి మీరు నీరసముగా, ఏదో ఆలోచిస్తూ ఉంటున్నట్లు చూస్తున్నాను. నా మాట విని ఒకసారి డాక్టరు దగ్గరకు వెళ్ళండి."



ఆమె చెప్పిన విషయమూ నిజముగానే ఉంది, సరే అలాగే చేద్దామని డాక్టరు దగ్గరకు వెళ్లేను ఆయన యిలా అన్నారు: "మీరు అనేక సమస్యలతో కష్టపడి పనిచేస్తున్నారేమో, మీకు ఎక్కువ పోషణ కావాలి. తగినంత పోషణ కలుగుటకు మీరు రోజూ హార్లిక్స్ త్రాగండి. మీరు చురుకుగా ఉంటారు."



రోగమునుండి కోలుకొంటున్న వారిని డాక్టర్లు హార్లిక్స్ వాడమనడము నాకు తెలిసినదే. దానిని నేను ఎందుకు త్రాగాలో నాకు అర్థము కాలేదు. కాని మా ఆవిడ బలవంతముమీద రోజూ హార్లిక్స్ త్రాగడము ప్రారంభించేను.



గోధుమ పిండి, మాల్టెడ్ బార్లీల పోషణతో కూడిన శ్రేష్టమైన డెయిరీ పాలతో తయారయే హార్లిక్స్ నాకు కొద్ది రోజుల్లోనే ఎక్కువ శక్తి ఉత్సాహములను కలిగించింది. ఆఫీసులో నా పనిని మెచ్చుకొని నన్ను ప్రమోషనుమీద మా ఊరికి దగ్గర ఊరు బదిలీ చేసేరు. హార్లిక్స్ చేసిన మేలు మేము ఎన్నటికి మరచిపోలేము!




## హార్లిక్స్ అదనపు శక్తిని కలిగించును!

# ఆంధ్రసచిత్రవార పత్రిక

వ్యవస్థాపకులు .
**దేశోద్ధారక కాశీనాధుని**
**నాగేశ్వరరావు పంతులుగారు**
*
శుక్రవారం : 14—6—63
శోభకృన్నామ సం॥ జ్యేష్ఠ మాసం॥ బహుళ సప్తమి
సంపుటము 55 సంచిక : 41
స్థాపితము :
1908
*
ముఖ్య సంపాదకుడు
శివలెంక శంభుప్రసాద్
*
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ
*
**ఒక సంవత్సరం చందా వివరాలు**

ఇండియా . రూ. 13.00 ఇతర దేశాల. ఓడమీద Sea Mail రు. 20.00. (విమానం ద్వారా (Air Mail): బ్రిటన్, జర్మనీ, ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా 135.00.)
*
విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.
*
**ఆంధ్రపత్రిక కార్యాలయము**
**7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1**





**లావణ్యసుందరి విజయలక్ష్మి [ఫోటో: ప్రభాకర్]**

# మనలోమాట

'ధూమపానం' వ్యాసంలో పొగాకు మనదేశానికి ఎలా వచ్చిందో వ్రాయబడలేదు! ఈ విషయం మీద ఎవరయినా వ్రాసిపంపుతారని ఆశిస్తున్నాము...

* * *

వీలయితే ఈ వారం శ్రీమతి రాజసులోచన పెళ్ళిఫోటో వేద్దామనుకున్నాము. కాని బొమ్మ మాకు చేరనందున మరొక సంచికకు వాయిదా వెయ్యవలసి వచ్చేటట్లు ఉంది!...

* * *

వచ్చేవారం ఐక్యరాజ్య సమితి కార్యదర్శి శ్రీ యు థాంట్ రచించిన వ్యాసం ఒకటి ప్రచురిస్తున్నాము.

* * *

రాబోయే ఆంధ్ర సచిత్ర వార పత్రిక సంచికలో 'బెలూన్‌లో ధ్రువయాత్ర' అయిపోతుంది తరువాత ప్రచురించబోయే సీరియల్ కూడా దీనివలెనే ఫ్రెంచి నవల. వివరాలు వేరే ప్రకటిస్తాము....

* * *

'నా అనుభవంలోకెల్లా పరిశోధన' వ్యాసం ఈ వా వెయ్యటంలేదు. వచ్చేవారం ప్ర రిస్తాము

* * *

**నవలల పోటీకి ఈ నెల 22 తేదీయే ముగింపు తేదీ అని ర యితలు గమనించ ప్రార్థన !**



"నువ్వు నాటకాలలో 'సారంగ వేషాలు వేసేవాడివి కదా! మానేశావేం
"ఏం చెయ్యనూ! 'సారంగధర మె సీనులో జనం గోలచేసి 'మాకు యి పడెయ్యండి! ఆ కాలూ చెయ్యీ మే తీసేస్తాం' అన్నారు!"

# విషయానుక్రమణిక


**కథలు :**

| | |
|---|---|
| విశాలోదంతం | — 12 |
| అపార్థం | — 22 |

**సీరియల్ కథలు :**

| | |
|---|---|
| తొనరకొలని | — 14 |
| బెలూన్‌లో ధ్రువయాత్ర (బాలసాహితి సీరియల్) | — 20 |

**శీర్షికలు, వ్యాసాలు, సినిమా :**

ఉత్తరాలు — 3, ఊమెన్‌కార్యా న — 6 మ్యాథిల్లీలేఖ — 7, రాజధానిబుర్ — 9 పరాగమూలం — 10, అవీ ఇవీ అన్నీ, రూపాలు—11, కుటుంబంలో నానటికి తీ పోయే తండ్రి ప్రాబల్యం (వ్యాసం) — 1 వనితావాణి, వంటలు—19, — 24 ధూమపానం — 26, — వెనుక — 28.


విత్తు ఒకటి నాటిన


మొక్క వేరొకటి మొలుచునా


పదే పదే రామాయణం వుదహ
రిస్తూ మొరార్జీగారు
బంగారం వాడవొద్దని
స్త్రీల నుద్బోధిస్తారు
కాని.......


ఐక్య ప్రతి పక్షంగా రూపొందాలని పథకం


పుకారులు
ఈగలను చంపండి
వారం దేశ
వ్యాప్తంగా వున్నది



# అమ్రోహా ఎన్నికల ఫలితం మత తత్వానికే దెబ్బ!

శ్రీ కృష్ణ

ఇక్కడి వారందరూ ఉత్తరప్రదేశ్, గుజరాత్ ఉపఎన్నికలలో కాంగ్రెస్ ఓడిపోవటం గురించి చర్చిస్తున్నారు ఈ అపజయాలకు సంబంధించిన విషయం ఒకటి గమనించాలి అవి తటస్థ విధానానికి కాని, శ్రీ నెహ్రూ చైనా విధానానికి కాని వ్యతిరేక మయిన తీర్పులుకావు భారతదేశంలో ఓటర్లు ఎటువంటివారని చెప్పినా సరే అవవచ్చు, కాని, వారిలో ఎక్కువ మందికి తటస్థ విధానం అంటే ఏమిటో తెలియదు ప్రధాన మంత్రిగారి చైనా విధానం వారికింకా అర్థం అయిఉండదు శ్రీ నెహ్రూని ఇంకా ఇంత భక్తితో చూడటమే దీనికి తార్కాణం గత పదిహేను సంవత్సరాలలో ఈ దేశం రక్షణకు సంబంధించిన ఏర్పాట్లు ఎంతగా వెనకపడినవో వారికి తెలియదు ఒకప్పుడు భారత సైన్యం ప్రపంచ ఖ్యాతి సంపాదించుకున్నది రెండు ప్రపంచ యుద్ధాలలోనూ మంచి ప్రతిభ గలదని అనిపించుకున్నది అటువంటి ఈ సైన్యం ఇటీవల ఒక పెద్ద ఓటమికి లోనయింది ఈ సంగతి సామాన్య ప్రజలలో చాలామందికి తెలియదు, అర్థంకాదు

తిరిగి, ఈ ఎన్నికలకు సంబంధించిన మరొక విషయం పరిశీలిద్దాము. ఉ ప్ర. ఎన్నికలలో మత తత్వవాదులు కాదు గెలిచింది, వారి ప్రతివాదులు. ఎంత అసహ్యంగా ఉన్నా, నిజం నిజమే అమ్రోహాలో నూటికి ముప్పయి అయిదు మంది ఓటర్లు ముస్లింలు శ్రీ హాఫీజ్ మహమ్మద్ ఇబ్రహీం ముస్లిం కాదని ఎవరూ అనలేరు. అసలు మొట్టమొదట కాంగ్రెసు నిలబెట్టిన హిందూ ప్రత్యర్థిని లాగి పారవేసి శ్రీహాఫీజ్ ని పేర్కొనడంలో అర్థం ఏమిటి? మరొక సందర్భంలో ముస్లిం వోటర్లు హిందువుకి వోటు చెయ్యవచ్చు కాని హిందూ-ముస్లిం పోటీలో ముస్లిం లందరూ ముస్లిం 'కాండిడేట్'కే తమ వోట్లు వేస్తారని మతవిభేదాలు గుర్తించని కాంగ్రెసు పార్టీకి తెలుసు ఈ జ్ఞానమే కాశ్మీర్ లో ప్లెబిసైట్ కి అడ్డం వస్తోంది అంటే, హాఫీజ్ సాహెబ్ గారిని ఈ ఎన్నికలలో నిలబెట్టడంవల్ల 'రెండు దేశాల సిద్ధాంతా'న్ని (టునేషన్ థియరీ) కాంగ్రెసు స్వీకరించిన దన్నమాట

దూషణ ఆపి, తమ తప్పుని ఒప్పుకుని ఉ ప్ర ఉప ఎన్నికలలో మత తత్వం ఓడిపోయినదని కాంగ్రెస్ అంగీకరించాలి జనసంఘ్ నిలబెట్టిన ప్రత్యర్థి ఓడిపోయాడు అలాగే కాంగ్రెస్ నుంచోబెట్టిన ముస్లిం ప్రత్యర్థి కూడా ముస్లింలు అధికంగా ఉన్న నియోజకవర్గంలో అపజయం పొందాడు

ముసల్మానులు ఎక్కడ చిక్కులో ఉన్నా రైల్వేల ఉపమంత్రి శ్రీ షానవాజ్ ఖాన్ ప్రత్యక్షమవుతారు అలిగర్ లో కొట్లాటలు జరిగినప్పుడూ అంతే, అమ్రోహాలోనూ అంతే

అసలు నేరస్థుడు తప్పించుకుపోయాడు శ్రీ కృపలానీమీద పగ తీర్చుకుందామనే శ్రీ కృష్ణమీనన్ హాఫీజ్ సాహెబ్‌గారిని అమ్రోహానుంచి పోటీ చేయించాడు కాంగ్రెస్ ఎవరినయినా ఖండించ దలిస్తే, ఈయననే

ఇవన్నీ అలా ఉంచండి అసలు సామాన్య ప్రజల బాధలే వేరు జీవనమే దుర్భరం అయిపోయేటంతగా రోజు రోజుకీ ఖర్చు పెరిగిపోతూ ఉన్నది ఒక వైపు మరొకవైపు పన్నులు పెంచివేస్తున్నారు వారి భవిష్యత్తు నిరాశ కలిగించేటట్లుగా ఉన్నది ఎప్పటికయినా పన్నులు తగ్గుతాయా? నిత్యజీవితపు ఖర్చులు తగ్గుతాయా? ఈ ప్రశ్నలకు సమాధానం ఈ మూడు ఉప ఎన్నికలలోనూ చూడవచ్చు

ప్రధాన మంత్రిని విమర్శించటం నాకు చాలా బాధ కలిగిస్తున్నది

-50 వ పేజీ చూడండి



అమ్రోహా విజేత ఆచార్య జె. బి. కృపలానికి ఢిల్లీలో సన్మానం జరిగినప్పుడు వారు ప్రసంగిస్తున్న దృశ్యం.

# మీ భోజనాల గదిని ఆకర్షణీయముగా చేసుకోండి!



మీ భోజనాల గదిని ఆకర్షణీయముగా చేసుకొనుటకు భోజనాల టేబుల్ మీద బొంబే డైయింగ్ వారి టేబుల్ గుడ్డలను పరచుకోండి! తెలుపు, గులాబి, నీలి, ఆకుపచ్చ మరియు పసుపుపచ్చ లేత రంగులలో టేబుల్ కవర్లు, టేబుల్ గుడ్డలు మరియు టేబుల్ నేప్‌కిన్లు దొరకుచున్నాయి. వీటన్నిటికీ ఆకర్షణీయమైన, నేయబడిన పూల డిజైనులు కలవు. బొంబే డైయింగ్ వారి యీ టేబుల్ గుడ్డలను కొంటే మీరు ఎంతో మంచి బట్టలను కొంటున్నారన్నమాట.

దేశమంతటా అన్ని పెద్ద చిల్లర బట్టల షాపులలోను
మరియు యీ క్రింది వారివద్ద లభిస్తున్నాయి:
దక్షిణ భారతదేశపు డిస్ట్రిబ్యూటర్లు:
చెల్లారామ్స్
(మద్రాసు & హైదరాబాదు)

# బొంబే డైయింగ్

ది బొంబే డైయింగ్ & మ్యానుఫేక్చరింగ్ కంపెనీ లిమిటెడ్



నిజామాబాద్‌నుండి నిర్మల్ వెడుతూ దారిలో కాంగ్రెస్ అధ్యక్షులు పోచంపాడు ప్రాజెక్టు స్థలాన్ని చూశారు.

# అదుపు ఆజ్ఞా లేని నగరవీధులు
# క్రమంతప్పిన, రాదారి సౌకర్యాలు

హైదరాబాదు, సికింద్రాబాదు జంటనగరాలు రెండూ కలిసి విశాలహైదరాబాదు అయింది. రెంటికీ ఒకే మునిసిపల్ కార్పొరేషన్ ఏర్పడింది. విడివిడిగా ఉన్నప్పుడే, పోటీ తత్వంతోనైనా, పట్నాన్ని అభివృద్ధి చెయ్యాలనే కాస్తంత పట్టుదల కనిపించేది. ఇప్పుడు అలాంటిదానికి అవకాశంలేదు. కార్పొరేషన్‌వారు రాజధానిని సుందర నగరంగా, ఆకర్షణీయంగా, రూపొందించలేకపోతున్నారనే అసంతృప్తి ఒకవైపుండగా, పుర ప్రజలకు కనీసపు సౌకర్యాలు కల్గించటంలో కూడా శ్రద్ధా సక్తులు చూపించలేకపోతున్నారని ఇంకోవైపు నిశిత విమర్శ ఉంది. సరే, బిచ్చగాళ్లు ఉండనే ఉన్నారు. వాళ్లకు నివాసం కల్పించి, ఆరోగ్యంగా ఉన్న ప్రజలకు వారిద్వారా అంటురోగాలు వ్యాపించకుండా ఉంటానికిగాను తగిన ఏర్పాట్లు ఇంతవరకు లేనేలేవు. వీరితోపాటు విచ్చలవిడిగా వీధుల వెంబడి తిరిగే పశువుల సందడి సరే సరి! వీటిమూలాన, రహదారి వసతులకు తీవ్ర అంతరాయం కలగటమే కాకుండా, కొన్ని ప్రమాదాలకు కూడా ఇవి దోహదకారిగా ఉంటున్నాయి. అయితే వీటిని అదుపులో పెట్టే ప్రయత్నం ఏమీ ఉన్నట్టు తోచదు.

ఈసంధ్య ఎప్పుడో ప్రభుత్వంవారే, వీటి బాధ్యతను తీసుకుని, ఒక పెద్ద పాల—సన్నాలు కేంద్రాన్ని నిర్మించాలని అనుకున్నారే కాని, కార్యరూపం దాల్చలేదు. ఇలాంటి దాన్ని, ఏర్పరచటానికి తగిన శ్రద్ధ కనపరుస్తేనేగాని ఈ పశువుల సమస్య పరిష్కారం కాదు. జంట నగరాల్లో, ఎవరికీ చెందని తరగతిలో, దాదాపు వెయ్యి పశువులు స్వైర విహారం చేస్తున్నట్లు అధికార వర్గాల అంచనా. అందువలన, ఒకవేళ వీటిని పట్టుకున్నా, ఎవరిని శిక్షించాలో అర్థం కావటంలేదు. కొంతమంది ఆవులను కావాలని, నగరాల్లో విడిచిపెట్టేస్తున్నారు. వాటిని ఎవరూ అడ్డగించరాదని, అలాంటి స్వేచ్ఛ గోమాతలకు ఇవ్వాలని వారి అభిప్రాయం. ఒకవేళ పట్టుకున్నప్పటికీ, 'అధికారులు' విధించే శిక్షను చిరునవ్వుతో స్వీకరించి, మళ్ళీ వాటిని వదిలిపెట్టటం పరిపాటయిపోయింది కూడా. సికింద్రాబాదులో ఈ పట్టుకున్న పశువులను ఉంచటానికి ప్రత్యేకంగా దొడ్డి ఒకటి ఉంది. హైదరాబాదులో ఇలాంటిది లేని కారణంచేత కూడా మునిసిపల్ అధికారులు, సమర్థవంతంగా, ఈ పశువుల స్వేచ్ఛా విహారాన్ని అరికట్టలేకపోతున్నారు. కొన్నాళ్ల క్రిందట పశువులు ఫలానా రోడ్లమీద సంచరించటానికి వీల్లేదని ఆంక్ష ఉండేది. అం కే లది అమలు పెట్టటానికి తగినంత సిబ్బందిలేక విరమించుకున్నట్లు తెలుస్తోంది.

జంట—నగరాల్లో, రోడ్లు బాగా వెడల్పుగా ఉంటాయని ప్రతీతి. అప్పటికీ ఈ వెడల్పు చాలదన్నట్లు, ఇంకా విశాలం చెయ్యటానికి ప్రయత్నాలు చేస్తూనే ఉన్నారు. రోడ్లకు రెండు వైపులా, కాలి—నడకకు అనుగుణంగా, వెడల్పయిన 'ఫుట్‌పాత్స్' ఉన్నాయన్న మాటే గాని, వాటి మీద దుకాణాలు వెలిశాయి. అసలు ఉపయోగమేమో, మనుష్యులు నడవటానికి కాని, ఏదో కాస్త ఆదాయం వస్తోందిగదా అనే సదుద్దేశంతో మునిసిపాలిటీవారు, ఈ దుకాణాలు పెట్టుకోవటానికి అనుమతిచ్చారు. దాంతో కాలి—నడక మహా కష్టమయి, ఇరకాటమయిపోతోంది. అసలే ట్రాఫిక్‌ను కంట్రోలు చెయ్యటం కష్టంగా ఉంటే, ఈ షాపులకు లైసెన్సులు ఇవ్వటమనేది పెద్ద అంతరాయంగా పరిణమించింది. ఇక ముందుముందు వీటికి లైసెన్సులు, మునిసిపాలిటీవారు ఇవ్వదలచుకోవట్లు తెలుస్తోంది. కాని, ఈ మాటమీదే ఉంటారా అనే ప్రశ్న లేకపోలేదు. మామూలుగా ఉన్న పెద్దషాపుల్లోనుంచి విద్యుచ్ఛక్తి సరఫరా చేసుకుంటూ, ఈ కాలిబాటల మీద రకరకాల షాపులు విరివిగా వ్యాపారం కొనసాగిస్తూనే ఉన్నాయి.

—52 వ పేజీ చూడండి



# సరాగమాల

## వి. ఎ. కె. రంగారావు

మూడు వారాల క్రిందట వేసిన ప్రశ్నకు జవాబు "కాంచెను తలపై పింఛము కదలిన పంచ భూతములు ప్రపంచమంతా సంచరించునని సజ్జను లందురు" అని చరణం గలిగిన పాట మొదట "కృష్ణా జేజేలయ్యా జోహారు" స్టార్ కంబైన్స్ వారి "కృష్ణప్రేమ"లో నారద పాత్రధారియైన సూర్యకుమారి పాడినది. రాగం మూర్‌దాస్ మల్హార్, కురటి. సంగీతం: సంగీతోపాధ్యాయ గాలి పెంచల నరసింహారావు. ఈ సరాగమాల వ్రాసే నాటికి సరిగా సమాధానం (దర్శకుని, రాగాల పేర్లు మినహాగా) వ్రాసి పంపిన వారు ఒక్కరే. అంత చక్కని పాటను అప్పుడే మరచిపోయారా?

పాఠకులకు మరొక పోటీ. కొత్తరకం పోటీ. ఈ నెలలో రెండు ప్రైవేటు రికార్డులు విడుదలైనవి. హెచ్. ఎం. వి. వారిది ఎన్. 96238. ఒక ప్రక్క బి. గోపాలం పాడిన "ఈ చల్లని రేయి" ఆరుద్ర సాహిత్యం. రెండవ ప్రక్క బి. గోపాలం, ఎ. పి. కోమల పాడిన యుగళ గీతం "మరుకేళి తేలించర" ఆనంద కుమార్ సాహిత్యం. రెండింటికీ బి. గోపాలమే సంగీతం. కొలంబియా వారిది జి. ఇ. 22794. ఈ రికార్డులో ఎమ్మెస్ రామారావు పాడిన రెండు అష్టపదులు "రమతే యమునా పులిన వనే", "రాధికా కృష్ణా" ఉన్నవి. వరసలు రామారావుగారివే. ఈ రెండు రికార్డులనూ సమీక్షించ మని పాఠకులను కోరుతున్నాను. మీ రెప్పుడూ రికార్డులను వినే, కొనే డీలరు దగ్గరే ఈ రికార్డులను వినండి. నాలుగు పాటల గుణ దోషాలను ఎత్తి చూపండి. ఈ రికార్డులు మీ డీలరు తెప్పించి యుండకపోతే, వెంటనే ఆర్డరివ్వమనండి. కొత్త విడుదలలు కావున ఆర్డరిచ్చినా, అవి మీరే తీసు కొనాలనే నిర్బంధం చేయరనుకుంటాను. ఈ రెండు రికార్డుల సమీక్షను నా పేరిట సరాగమాల శీర్షికకు పంపండి. కవరుమీద స్పష్టంగా సమీక్ష పోటీ అని వ్రాయండి. ఈ ఉత్తరాలలో మరే విషయం వ్రాయవద్దని కోరిక. మీ పూర్తి అడ్రసుతోబాటు మీ రెప్పుడూ రికార్డులు కొనే డీలరు పేరూ, ఊరూ వ్రాయండి. నాకు వచ్చిన సమీక్షలకు వరుసగా మూడు బహుమతులు ఈ విధంగా ఇవ్వబడుతవి. మొదటి బహుమతి: ఆయా కళాకారుల సంతకాలతో పై రెండు రికార్డులు. రెండవ బహుమతి: ఈ రెండింటిలో ఒక రికార్డు. మూడవ బహుమతి: మీరు కోరిన దక్షిణ దేశ నేపథ్య గాయకుని ఛాయా—చిత్రం. మీ మీ సమీక్షలు నాకు జూన్ నెలాఖరులోగా చేరాలి. జాగ్రత్తగా గుర్తుంచుకోవలసిన విషయాలు: పై రెండు రికార్డులూ సమగ్రంగా సమీక్షించాలి. మీ పూర్తి పేరు, అడ్రసు, మీ డీలరు పేరు, ఊరు; రెండవ బహుమతికి అర్హులైన పక్షంలో ఏ రికార్డు కావాలో, మూడవ బహుమతికి అర్హులైన పక్షంలో ఎవరి ఫొటో కావాలో వ్రాయాలని జాగ్రత్తగా గుర్తుంచు కొనండి. కవరుమీద సమీక్ష పోటీ అని స్పష్టంగా వ్రాయండి. ఈ పోటీలో పాఠకులందరు ఉత్సాహంతో పాల్గొంటారని ఆశిస్తున్నాను.

* * *

రెండు వారాల క్రిందట ఒక క్రొత్త గాయకుని పరిచయం చేశాను. వారిపేరు అచ్చులో తప్పుగా పడింది. సరియైన పేరు కె. ఎస్. రాగి. వారి రికార్డు ఈ పాటికి విడుదలై ఉంటుంది. విన్నారా?

చదువుకున్న అమ్మాయిలు N69770

పై చిత్రంలో అన్ని తరగతుల శ్రోతల్నీ, ప్రేక్షకుల్నీ అలరిస్తూ, రికార్డుల అమ్మకంలో కూడా పైచేయి మాదేనని నిరూపిస్తున్న రెండు పాటల్లో ఒక పాట పై రికార్డునున్న యుగళగీతం, శ్రీ సినారే రచన "కిలకిల నవ్వులు చిలికిన, పలుకును నాలో బంగారు వీణ" (రెండవది క్రిందటి వారమే పరిచయం కాబడిన "వినిపించని రాగాలే") చాల అందమైన పాట.

రెండవ పంక్తిలో "కలిగిన కలతే నిలిచిన, ఎరిసెను నాలో మందార మాల" అని ఉన్నది. కాని, పల్లవితో సరిపోల్చితే "విరియును" అని కదా ఉండాలి! ఈ శస్త్ర పరీక్ష సినిమా పాటలకు కూడ దేమో! సి. నారాయణరెడ్డి సిద్ధహస్తం "నీవున్న వేరే సింగారమేల, నీ పాదధూళి సిందూరము కాదా."

"నీ కురులే నను సోకిన వేళ హాయిగ రగిలేను తీయని జ్వాల" అను రెండు చరణాలలోను తెలుస్తున్నది. ఈ పాటకు వరస సాధారణమైన కల్యాణి రాగంలోనే ఉన్నా, రాజేశ్వరరావు పెట్టిన వంపులు అసాధారణంగా ఉన్నాయి—ముఖ్యంగా అవరోహణలో,



పద్మశ్రీ సావిత్రి రాజేశ్వరి. [ప్రభాకర్]

పాడిన సుశీల, ఘంటసాల గంధర్వ లోకాలను గుర్తుకు తెచ్చారు. ఇటువంటి ప్రేమగీతాలు వారి కంఠాలలో పలికినంత శృంగారంగా మరెవరి కంఠాలలోను పలుకవేమో! వాద్య రచన చిలుక మడుపులో మృగమదవు ఘుమాయింపులా ఉంది

రెండవ ప్రక్క "నీకు తోడు కావాలి" అనే యుగళ నృత్య గీతం. దీనికి మాతృక 'కం సెప్టెంబ' రనే ఆంగ్ల వాద్య గీతం. వరసలో రెంటికీ అంత పోలిక లేకపోయినా, అవలీలగా వినవడుతున్న లయలో బాగా పోలిక ఉంది. ఒకే వరసను పాశ్చాత్య ధోరణిలోను, పక్కా కర్ణాటక ధోరణిలోను వినిపించడమే ఇందులో కనబడుతున్న రాజేశ్వరరావు ఘనత హార్మణీ పెట్టి గురించి సుశీల కమ్మగా పాడినా, ఘంటసాల పాడటం మరీ బరువనిపించింది. ఇందులో మరొక వింత ఆరుద్ర రచన అంత కుదురుగా లేకపోవడం

### ఈడు—జోడు GE 35338

శ్రీనివాస్, వసంతలు పాడిన సరదా యుగళ గీతం "సూర్యుని చుట్టు తిరుగుతుంది భూగోళం" సరదాగానే ఉంది. చిత్రంలో ఈ పాట ఇంత చక్కగా అమరటానికి కారణం బ్యాక్‌కారులా వడిగా సాగిన చిత్రీకరణ. తెరపై చలం, మణిమాల చూపిన చలాకీ నటన. ఆరుద్ర రచనలో 'తలలో తిరుగును గందరగోళం' అని ఉన్నా, వాస్తవానికి రచన అతి సుల భంగా ఎంత ప్రేమ మైకంలోఉన్నా సుగ్రాహ్యంగా ఉంది. శ్రీనివాస్ మడత సంగతుల మెలికలతో పాడటం అందరికీ తెలిసిన విషయమే. అందులో కొత్తేమీలేదు. వసంత కూడా అందుకు ఏమాత్రం తీసిపోకుండా పాడటం మాత్రం కొత్తే. పెండ్యాల వరసలో ప్రత్యేకత ఏమీ లేకపోయినా, వాద్యగోష్ఠిలో ఆ కార్డియన్ల ఆర్భాటం అవీ ఉన్నాయి.

రెండవప్రక్క రమణారెడ్డి కాదు కాదు మాధవ పెద్ది పాడిన "విష్ణువాద" మనే భజన కీర్తన. ఈ పాట వింటుంటే ఒక సినిమా పాటనిపించదు. మన రామ మందిరాలలో భజన కూటాలలో వినబడు తుంటాయే పాటలు అచ్చం అలాగే ఉంటుంది. ఇదే ధోరణి మాధవపెద్ది పాడటంలో, ఆరుద్ర రచనలో, పెండ్యాల అమర్చిన మెట్టులో, వాద్యానుసరణలో అన్నిటా ప్రతిబింబిస్తున్నది. చివర కొచ్చేసరికి పాట పాటలా ఉండదు. రెండు ముఠాలు సంగీత తాళ లయ సమేతంగా పోట్లాడుకొంటున్నట్టే ఉంటుంది. అచ్చంగా ఇటువంటి యుద్ధమే నేను నాలుగేళ్ల క్రిందట కీర పండరిలో పాండు రంగాలయంలో వినడం తటస్థించింది. రెండు ముఠాల భజనపరులు "బృందావనికే వచ్చినాడు" అని గొంతు చించుకుంటే, "మధురాపురికే వెళ్లి నాడు" అని ఎదిరి బృందం అరవడం. వారి భక్తిని విమర్శించటం కాదు గాని, ఆ సంఘటన తలచుకున్న, బొబ్బిలి వెళ్ళినపుడు ఆ తంతుని శ్రీమతి గౌరమ్మా శర్మ, శ్రీమతి రాజలక్ష్మి మూర్తి—ఇరువురు కలిసి అభినయించినపుడు కడుపు చెక్కలయ్యేటట్టు నవ్వొస్తుంది. మొన్న "ఈడు—జోడు" ప్రెస్‌షో చూస్తూ ఉండగా ఆ కీర పండరి భజన, పై ముత్తైదువుల అభినయ దృశ్యం సూపరింపోజిషన్లా కనపడి ఆపినా, ఆగక గుండెల్లోంచి నవ్వు ఖంగుమని బయటికి దూకి ఉన్న వాళ్ళందరినీ దిగ్భ్రాంతుల్ని చేసింది.



# నామరూపాలు - 5



అసలు రూపం ఆంధ్ర సచిత్ర వారపత్రికకొరకు ప్రత్యేకం తీసినది.

# అవీ - ఇవీ - అన్నీ

## సెట్టుమీద "బందిపోటు"

"ఎవణ్ణి నువ్వు కలుసుకోకూడదనుకున్నావో వాణ్ణే నువ్వు కలుసుకున్నావన్నమాట."

"అవును; చిన్నాన్నను కలుసుకునే అదృష్టం నాకు కలిగింది."

"చిన్నాన్న ! ఎవడా చిన్నాన్న ? నాకు తమ్ముడు లేనే లేడు."

"కాదన్నంత మాత్రాన రక్తం పంచుకొని పుట్టిన తమ్ముడు తమ్ముడు కాకపోతాడా !"

"హింసా మలినమైన వాడి ముఖం చే నేవాడో మర్చిపోయాను."

"హింస— కట్టుకున్న భార్యను, కన్న బిడ్డలతో చిత్రహింస చేస్తే చూసి సహించమంటారా ? పగ సాధించలేక పడి ఉండమంటారా ?"

"నీ పినతండ్రి ఒక్కడి పగవల్ల రోజూ ఎందరి అమాయకుల తలలు తెగుతున్నయో తెలుసా ?"

"ఆ తలలు తెగడం— నా పినతండ్రి పగవల్ల కాదు; ఆ శూరసింహుని దౌర్జన్యం వల. ఈ అమాయకులను రక్షించి, ఆ దుష్టులను శిక్షించడమే చిన్నాన్న లక్ష్యం."

"దుష్టశిక్షణ— శిష్టరక్షణ— చేయవలసింది రాజ్యపాలకులు కాని మనంకాదు."

—64 వ పేజీ చూడండి

# విశాలభారతం

విహారి శ్రీనారాయణ

"రాస్కెల్ ! స్టుపిడ్ !! ...."

కిలకిల నవ్వులతో కేరింతలతో గలగలమంటూ కోలాహలంగా ఉన్న లేడీస్ వెయిటింగ్ రూమ్ ఒక్కసారిగా విస్తబ్ధమయింది. ఒకరి ముఖాలొకరు చూసుకుంటూ కళ్ళతో ఒకరి నొకరు ప్రశ్నించుకున్నారు కొమ్మ లందరూ. సమాధానం దొరక్కపోగా, అందరి కళ్ళు విశాల మీద పడ్డాయి.

విశాల విసురుగా ప్రవేశించింది. ప్రవేశిస్తూనే బుసబుసమంది. చేతిలోని పుస్తకాల్ని టేబుల్ మీదకు విసిరింది. బెంచిమీద కూలబడి అరచేతిని నుదుటిమీద పెట్టి, అరు పెకవ్లు కళ్ళు మూసుకుంది. వెంటనే కళ్ళు తెరిచి తనమీద ఎన్ని జతల కళ్ళు కేంద్రీకరింపబడ్డవో లెక్కించింది.

'ఫూల్, ఇడియట్, బ్రూట్' అంది చివరి అమ్మాయి దాకా లెక్కించి.

'నేనేనా ?' ఆ చివరి అమ్మాయి భయం భయంగా ముందుకొచ్చింది.

విశాల జవాబు చెప్పలేదు. వాకిలివేపు చూస్తూ 'ఇలాంటి రోగ్స్‌ను ఏంచేయాలో నాకు బాగా తెలుసు. ప్రిన్సిపాల్‌కు చెప్పి డిస్మిస్ చేయించకపోతే, నా పేరు ....' అంటూ శక్తిలాగా ఊగింది.

విషయమేదో చాలా సీరియస్‌గానే ఉందని కని పెట్టిన అమ్మాయి లందరూ ఏదో కూడబలుక్కున్నారు. గుసగుసలాడుకున్నారు. డిస్మిస్ కాబోయే అభాగ్య వ్యక్తిమీద వారికి జాలి కలిగింది. ఎలాగైనా ఈ (విశాల) కాళికాదేవి రౌద్రాన్ని శాంతపరచి ఆవిడ తన ప్రతిజ్ఞను ఉపసంహరించుకొనేలా చేయాలనుకున్నారు.

'ఎవరే, అన్ని పేర్లు గల ఆ మహానుభావుడు ?' అంది రాజ్యలక్ష్మి, విశాల—కోపాన్ని తగ్గించాలనే ధోరణిలో.

రాజ్యలక్ష్మి ఆ (డ) పిల్లలకు పెద్ద; వయసులోనూ, మాటల్లోనూ.

'ఇంకెవరు! ఆ ధర్మారావే.' రాజ్యలక్ష్మివైపు తిరక్కుండానే జవాబు చెప్పింది విశాల.

'ఏమన్నా డేమిటి?'

'నోటి కొచ్చినట్లు వాగుతాడు. నేను జూలియట్‌నట; జాన్నుగడ్డనట; మిస్ కాలేజీనట; మాలా సిన్హానట' ఆవేశంతో చెప్పుకుపోతోంది విశాల.

'వండ్రఫుల్ .... వండ్రఫుల్' విజయ చప్పట్లు కొట్టింది.

'వండ్రఫులేమిటే? ఫూల్' విజయను సంబోధించింది విశాల. విజయ బదులు చెప్పింది:

'కాలేజీలో ఏమిటే? నీ అందాన్ని మెచ్చుకొని నీకు బిరుదుల్నిస్తుంటే గర్వించవలసింది బాధపడ్తావేమిటి?'

'విజయా! ఇలాంటి విషయాల్ని అంత తేలిగ్గా తీసివేయగూడదు. నీకు తెలియదు. ఈరోజు అతను కూసే కారు-కూతలను మనం ఉపేక్షించి ఊరుకుంటే ఏమవుతుందో తెలుసా? రేపు ఇంకొకటంటాడు. తర్వాత కాలేజీ అంతా అంటు వ్యాధిలా ప్రాకిపోయి అందరూ విశాలను మారు పేర్లతోనే పిలుస్తుంటే, విశాల తన అసలు పేరును గూడ మర్చిపోతుంది' రాజ్యలక్ష్మి అంది.

'అంతదూరం ఎందుకు? రేపు నీ వెంటబడి నిన్నే అలాంటి మాటలంటుంటే ఊరుకుంటావా?'' విజయ నడిగింది విశాల.

'ఏం చేస్తావేం? వాళ్ళు రౌడీ నెంబరు వన్‌లు. దేనికైనా తెగించినవాళ్ళు. వాళ్ళతో విరోధం పెంచు కోటం అవివేకమంటాను' అని విజయ జవాబు.

'పిరికిదాని వంటావు. నిబోటివా ళ్ళుండబట్టే వాళ్ళు ఈవిధంగా చెలరేగటం. ఐ కెనాట్ టాలరేట్. ప్రిన్సిపాల్‌కు రిపోర్టుచేసి తీర్తాను' విశాల దృఢంగా అంది.

'తొందర పడొద్దు విశాలా! విజయ చెప్పిన దాన్లో నిజం లేకపోలేదు. ప్రిన్సిపాల్‌కు రిపోర్టు చేస్తే, ఆయనేం చేస్తాడు? జరిమానా వేస్తాడు. లేక డిస్మిస్ చేస్తాడు అనుకుందాం. మనకు ఒరిగే దేఁటి? కాలేజీ నుంచి డిస్మిస్ చేయబడ్డంత మాత్రాన అతను నిన్ను అల్లరిపెట్టక వదుల్తాడా? అదీగాక డిస్మిస్‌చేస్తే అతని లైఫే నాశనం అవుతుంది.'

'మనల్ని అల్లరిపెట్టే, మన ఇంటెగ్రిటీ, పర్సనాలిటీ, లైఫూ—అన్నీ నాశనం కావటంలా'?—విశాల.

'అది కాదు విశాలా! నా అభిప్రాయం సామ దాన భేదోపాయాలతో అతనిలో సద్వర్తన కలుగజేయాలని' రాజ్యలక్ష్మి అంది.

'సంస్కరిదిద్దామనా? అలాంటి ప్రయత్నాలు చేయకు. నిన్ను కూడ సత్కరిస్తాడు'—ఓ కంఠం

'ఏవిధంగా?' ఓ ప్రశ్న.

ఆ ప్రశ్నకు జవాబు రాకముందే, రాజ్యలక్ష్మి అంది:

'నాకేం భయంలేదు. నా ప్రయత్నం నేను చేసి తీర్తాను.'

'ఏం చేస్తానంటావ్?' విశాల అడిగింది.

రాజ్యలక్ష్మి కొంతసేపు ఆలోచించింది. 'రాఘవ్ తెలుసుగా?'

'ఫస్టుమార్కుల్ని గుత్తకు తీసుకున్నతనేనా!' పూర్ మార్కు కళ్ళు పెద్దవి చేసింది.

అవునన్నట్లుగా కాలేజీ—గంట మ్రోగింది.

'ధర్మారావుకు రాఘవ్ అంటే భయం. మనం ముందుగా రాఘవ్‌ను కలుసుకుని అతనిచేత ధర్మారావుకు చెప్పిద్దాం, పిచ్చి పిచ్చి వేషాలు వేసి ఆడపిల్లల్ని అల్లరిపాలు చేయవద్దని. రాఘవ్ మాటను తీసేయలేడు ధర్మారావు.

'ఈ రౌడీ—ధర్మారావు ఆ మాటలు రాని రాఘవ్‌కు భయపడటమేమిటి?' విజయ ఆశ్చర్యంగా ప్రశ్నించింది.

''అదంతేలే. ధర్మారావు జనకునికి తన మిత్రుడి సంగతి బాగా తెలుసు. అందుకని అప్పట్లో ధర్మారావు రూమ్మేటు అయిన రాఘవ్‌తో పుత్రుణ్ణి ''అల్లరి చేయకుండా కనిపెట్టు నాయనా'' అన్నాడుట. తర్వాత రెండుమూడుసార్లు తన స్వేచ్ఛకు రాఘవ్ అడ్డుతగుల్తున్నాడని ధర్మారావు రూం మార్చాడు. అయినా అతనంటే భయంగానే ఉంటాడుట— రాఘవ్ ఎక్కడ తన జనకునికి రిపోర్టు రాస్తాడోనని' రాజ్యలక్ష్మి చెప్పింది.

'అది సరే; మాటలు రాని రాఘవ్ అంటావేమిటి? విశాల, విజయను ప్రశ్నించింది.

'అంటే, అసలు మాటలు రావని గాదు; ఎవరితోనూ మాట్లాడడు. చాల రిజర్వుడులే' విజయ నొసల్ని ఎగరేసింది.

'ఇంతకీ ఏం తేల్చావే రాజీ?' విశాల పుస్తకాల్ని చేతుల్లోకి తీసుకుంటూ అడిగింది.

'సాయంత్రం రాఘవ్‌తో మాట్లాడుదాం ఉండు' అన్నది రాజ్యలక్ష్మి.

'నే నుండనే; నువ్వే మాట్లాడు, ఆ మాట్లాడేదేదో'.

'కథానాయికవి నీవు లేకుండానా?' అంటూ రాజ్యలక్ష్మి దారితీసింది క్లాసురూంకు.

## 2

ఆ రోజు సాయంకాలం కాలేజీ—హాల్—బెల్ అయింది. లెక్చరర్ పాఠం ఆపేసి, ప్లాట్‌ఫారం దిగి వెళ్ళిపోయాడు. విద్యార్థులు ఒక్కొక్కరే వెళుతున్నారు.

రోజూ లెక్చరర్ వెళ్ళగానే, వెయిటింగ్ రూముకు దారితీసే అమ్మాయిలు ఈరోజింకా బెంచీలమీదనుండి కదలకపోవటం విద్యార్థులకు ఆశ్చర్యాన్ని కలిగించింది. కొంతమంది ప్రశ్నార్థకంగా, అమ్మాయిలవేపు చూస్తూ ముందుకు వెళ్తున్నారు. మరికొందరు వరండాలో ఏదో పనిఉన్న వారిలాగా ఆగిపోయారు. క్లాసురూం ఖాళీ అయింది. రాఘవ్ తలవంచుకుని మెల్లిగా నడుస్తున్నాడు వరండావేపు. అమ్మాయిల బెంచీ—ముందునుండే వెళ్ళాలి వరండాలోకి. అలా వెళే ప్రతివాళ్ళూ ఆ బెంచీలపైనుండే 'కలర్‌ఫుల్' శాల్తీలపై ఒక చూపును విసరి, ఒక పోజు పారేసి వెళ్తారు సహజంగా. కాని, రాఘవ్ కన్నెత్తి చూడడు. తల వంచుకుని నడుస్తాడు.

రాజ్యలక్ష్మి గొంతు సవరించుకుంది:

''రాఘవ్‌గారూ!''

రాఘవ్ ఆగాడు. జరుగకూడని, జరుగరాని సంఘటనేదో జరిగినట్లయింది అతనికి. తల పైకెత్తి ఒక క్షణంలో సగంసేపు అమ్మాయిల్నందరిని కలయజూసి ''పిల్చారా?'' అన్నాడు

''మీతో కొంచెం మాట్లాడాలి. అలా వెయిటింగ్ రూంకు ఒకసారి వస్తారా?'' అంది రాజ్యలక్ష్మి మెల్లిగా.

రాఘవ్ ఏదో సమాధానం చెప్పబోయాడు. ఇంతలో వరండాలోనుంచి 'అచ్ఛీ' అంటూ ఒకటే తుమ్ము; వెంటనే నవ్వులు. రాఘవ్ వెళ్ళిపోయాడు.

రాజ్యలక్ష్మి, విశాల, విజయ— ఈ త్రయం లేడీస్ వెయిటింగ్ రూంలో చాలాసేపు ఆగారు. కాని, రాఘవ్ రాలేదు. అరగంట గడిచింది. 'అదేమిటే, అవసరంగా మాట్లాడాలి రమ్మనమంటే రాలేదు?' అని అడిగింది రాజ్యలక్ష్మి.

'నే చెప్పలేదుటే, అతను ఎవరితోనూ మాట్లాడే రకంగాదు. అలాంటప్పుడు అమ్మాయిలతో ఏం మాట్లాడ్తాడు?' అంది విజయ.

''ఏం, మాట్లాడ్తే?''

'సిగ్గు కాబోలు.'

'కాదే, భయం.'

'కొరుక్కు—తింటామనా?' ముగ్గురూ నవ్వారు. ఒక అరగంట వెయిట్‌చేసి, ఆ అమ్మాయిలు వెళ్ళిపోయారు.

వెళ్ళిపోయారన్న మాటే గాని, వారు ముగ్గురూ రాఘవ్‌ను గురించి, ధర్మారావ్‌గురించి ఆలోచించకుండా ఉండలేకపోయారు. ఎవరికి తోచిన విధంగా వారు ఊహాగానం చేసుకున్నారు. ముగ్గురూ మూడువిధాలుగా (ఆ విధాలు ఇక్కడ అప్రస్తుతమని కథకుల ఊహాగానం) ఊహాగానం చేసినా ఆ మూడు విధాలలోను ఒక సామ్యం ఉంది.

అది ఏమిటంటే ధర్మారావు రౌడీ అని, రాఘవ్ మంచివాడే అయినా చాల 'రిజర్వుడు' అని. (ఫెయిర్‌సెక్స్ అయివుండిగూడ) తమంతట తాముగా 'మీతో మాట్లాడాలి'రమ్మనమని రాఘవ్‌ను కోరినా, అతను రాకపోవటంవల్ల వారి అహం దెబ్బ తిన్నదనే చెప్పాలి. ముఖ్యంగా విశాల అలా అనుకుంది. కాగా, విజయ ''ఆఁ, అతనికి ఆడవాళ్ళంటే తగని భయం; పోనిద్దూ'' అని తేల్చివేసింది.

విజయ వెలిబుచ్చిన అభిప్రాయంలో నిజం లేకపోలేదేమో అని అనుకోవలసివచ్చింది రాజ్యలక్ష్మికి. కారణం ఆ మర్నాడు జరిగిన సంఘటనే.

సదరు మర్నాడు సాయంకాలం కాలేజీ వదలగానే, అమ్మాయిలు ముగ్గురూ బెంచీలమీద నుండి కదలకుండానే క్లాసులోనుండి బయటికి వెళ్ళే ప్రతివ్యక్తిని గమనిస్తున్నారు. తలా ఒక పోజు విసరి, లాల్చీ [illegible] సయితం ఉన్న కొద్దిపాటి కాలర్‌ను సవరి[illegible]ంటూ అమ్మాయిలవైపు దృష్టిసారిస్తూ వెళ్ళారు. కాని, అమ్మాయిలకు కావలసిన ఆ రాఘవ్—నామధేయుడు మాత్రం అసలు కన్పించలేదు. రాజ్యలక్ష్మి ఖాళీ క్లాస్ రూంలో నలుమూలలా వెతికింది 'ఎక్కడైనా నక్కాడేమో' అన్న విజయ—మాటననుసరించి. రాఘవ్ అయితే కన్పడలేదు గాని, రాఘవ్ కూర్చునే బెంచీమీద ఒక నోట్‌బుక్ కన్పించింది. రాజ్యలక్ష్మి మనసులో ఏదో తళుక్కున మెరిసింది. వెంటనే వెళ్ళి ఆ నోట్‌బుక్ తెచ్చింది. అది రాఘవ్ ఇంగ్లీషు నోట్సు. 'ఈ సారి తన నోట్సుకోసమైనా మనతో వచ్చి మాట్లాడకపోతాడా' అన్నది రాజ్యలక్ష్మి. ఏమో చూద్దాం పద అన్నది విజయ.

ఒక పావుగంట తర్వాత అమ్మాయి లందరూ వెయిటింగ్ రూంనుండి బయల్దేరి స్టెయిర్ కేస్‌మీదుగా క్రిందికి దిగుతున్నారు. స్టెయిర్ కేస్ 'ద్రాక్ష' ఆకారంలో ఉంది వెడల్పు తక్కువ అయినా, పైకొచ్చేవారు, క్రిందికి దిగేవారు ద్రాక్ష మధ్యలో తారసిల్లినపుడు తప్పుకోటానికి వీలైనంత జాగా వుంటుంది. రాజ్యలక్ష్మి విశాల, విజయ సరుసగా మెట్లు దిగుతున్నారు సగం వచ్చిన తర్వాత క్రిందనుండి రాఘవ్ వస్తున్నాడని గమనించారు. 'రాజీ, హీరో వస్తున్నాడేవ్' అని సాడిదగ్గు దగ్గింది అల్లరిపిల్ల విజయ. ఆ దగు రాఘవ్‌కు

46—వ పేజీ చూడండి



## జరిగిన కథ

ఆఫీస్ ఉద్యోగి కృష్ణమూర్తి, అతని తమ్ముడు రమేశ్ వైద్యవిద్యార్థి. భార్యపేరు శాంత. రమేశ్ వదిన శాంతకు తలనొప్పి బాధకలిగి ఎన్నిమందు లిచ్చినా తగ్గక చివరికి ఆస్పత్రిలో మరణిస్తుంది. ఆమె మరణంతో రమేశ్ పిచ్చిపట్టినంతగా ఆవేదన పొందుతాడు. అన్న బలవంతం మీద రమేశ్ బొంబాయిలో ఉంటున్న డా. శేషగిరి దగ్గరికి వెళ్ళాడు. శేషగిరి భార్య రత్న సాన్నిహిత్యంలో రమేశ్ ఆత్మీయతను సంపాదించుకుంటాడు. నళినితో పరిచయం కొంటుంది.

## 10

ఇంటికి వచ్చి భోజనాలవటమే ఆలస్యం; రత్న అడిగింది:

"బొంబాయికి ఎందుకొచ్చారు ?"

ఆశా: "అమ్మా! పక్క వేయమ్మా." రత్న పక్కవేసి ఆశను నిద్రపుచ్చింది.

రమేశ్ అన్నాడు:

"ఇప్పుడు నా కనిపిస్తోంది; నే నిక్కడికి రాకుండా ఉండాల్సిందని. అక్కడే ఉంటే బాగుండి పోయేది. ఇక్కడికి రావటమే మొదటి తప్పు. మీతో ఆత్మీయుల పెంచుకోవటం రెండవ తప్పు. రత్నా! నేను వెళ్ళిపోతాను. నన్ను పంపించేయండి. ఇంకా ఇక్కడుంటే నాకు పిచ్చిపట్టక మానదు.."

"పిచ్చా ?"

"ఊఁ; రత్న—పిచ్చి. నా మనసు నా అధీనంలో ఉండటంలేదు. నే నిక్కడే ఉంటే, ఏం జరుగుతుందో నేను చెప్పలేను రత్నా! నన్ను పంపించేయండి."

"ఎలా పంపను ?"

"మెడపట్టి గెంటేయండి."

"అది నా చేతకాని పని."

"చేతనయ్యేలా ప్రయత్నించండి. రత్నా! నేనో ప్రశ్న అడుగుతాను దాచుకోకుండా జవాబు చెప్తారా?"

"అడగండి"

"నన్ను మీరెందు కింతగా పట్టించుకున్నారు?"

"ఇంతగా అంటే ?"

"చాలా."

"కొన్ని విషయాలను వివరించి చెప్పటం కష్టం— మొదట్లో మిమ్మల్ని చూసినపుడు కుతూహలం కలిగింది. క్రమేణా కుతూహలం జాలిగా మారింది. జాలినుండి స్నేహం, ఆత్మీయత.... ఇలాగే....కాని, రమేశ్! మీరు నా గురించి అదే పనిగా ఆలోచించకండి. నాకు భయమేస్తుంది...."

"ఎందుకూ ?"

"మీరు సుఖంగా ఉండాలంటే, నన్ను మరచి పోవాలి. కాలమే అన్నిటినీ మరిపించగలదు."

"అయితే నన్ను పంపించేయండి."

"కాని, ఎలా పంపను? మిమ్మల్ని పంపించటానికి నాకు మనసు—రావటంలేదు. అలా అని మిమ్మల్ని ఇక్కడే కట్టివేసుకోలేను. మీ స్నేహం నాకు కావాలి. కాని, దానినుండి మీ కే హాని కలగరాదు."

"మరి మీకో ?"

"నా విషయం వదిలేయండి. ఎలాంటి పరిస్థితినైనా నేను నవ్వుతో ఎదిరించగలను. నాకు మిమ్మల్ని గురించే బెంగ."

"ప్రేమ గుడ్డిది."

"కాని, ప్రేమకు విచక్షణా జ్ఞానం ఉండాలి. నేను పగిలిన అద్దాన్ని. అందులో మొహం చూసుకోవా లని, దాన్ని అతికించాలనే సాహసం మీది. ఇదేం లాభం లేదు రమేశ్! ఈ విధమైన ఆత్మవంచన వల్ల ఇద్దరికీ సుఖంలేదు.

**రమేశ్, ఆమె మాటలు వింటూ కూర్చున్నాడు.**

వాళ్ళిద్దరి మాటలకూ మూగసాక్షిగా గడియారం టిక్కు టిక్కు మంటోంది.

రమేశ్ దిక్కుతోచక "అయితే ఇప్పుడేం చేద్దాం?" అన్నాడు.

"అన్నీ మరిచిపోయి, కొత్త జీవితం ప్రారంభించండి...."

రమేశ్ ఏమో చెప్పుదామని నోరు తెరచాడు. కాని, రత్న అతడిని మాట్లాడనీయక:

"మీరన్నీ మరిచిపోగలరు. అదేమంత అసాధ్యమైన పనికాదు. ఏళ్ళు గడిచిన కొద్దీ ఈ పాత ప్రకరణాలన్నీ అర్థంలేనివిగా అనిపించవచ్చు. గడిచిపోయినదాన్నే తల్చుకుంటూ, భవిష్యత్తు లేదని భావించేటంత ముసలివాళ్ళు కాదుమీరు. మీ జీవితమంతా ఇక ముందే ఉంది. ప్రయత్నిస్తే దీన్ని ఓ పీడకలగా భావించి మరిచిపోవచ్చు."

"పాతదాన్ని మరచిపోవాలంటే, కొత్తదేదైనా కావాలికదా ?.... మీ కైతే ఆశ ఉంది.... కాని నాకు ?"

"మీ చదువు, వృత్తి, సంసారం—వీటికన్నా ఏం కావాలి మీకు ?"

"కాని అందులో నేను మనఃపూర్వకంగా కోరుకునేది ఒక్కటీ లేదు."

కోపంతో రత్న—మొహం కందగడ్డయింది. కనుబొమలు ముడివేసి గుప్పిలి బిగించి:

"నా చేత బాగా దెబ్బలు తినాలని ఆశగా ఉంటే అలా మాట్లాడండి. ఒక్కోసారి మీరు మరీ మూర్ఖంగా మాట్లాడుతారు. మిమ్మల్నేం చెయ్యాలో తోచటంలేదు—" అంది. అలా అంటూనే గడియారంవైపు చూసి "పదకొండున్నరయింది. ఇక పడుకోండి" అంటూ లేచింది.

"ఇంకా డాక్టర్ రాలేదే !"

"ఆయన ఎప్పుడొస్తారో ఏమో. మీరు పడుకోండి" అంటూ అతడి గదిలోకి వెళ్ళి పక్క సరిచేసి బయటకు వచ్చింది.

రమేశ్ పసిపిల్లాడికి మల్లే లేచి—వెళ్ళి పడుకున్నాడు.

రత్న చేతిలో ఓ పుస్తకం పట్టుకుని పడుకుంది. ఆమె కళ్ళవెంట అశ్రువులు ప్రవహిస్తున్నాయి.

రమేశ్ బొంబాయి వచ్చి ఒక నెలకు పైగా అయింది. రత్న—స్నేహోదరాలతో అతడికి రోజులు గడిచిపోతున్న విషయమే తెలియటంలేదు. కాని కొద్దిరోజులు ఉండి వెళ్ళటానికి వచ్చిన రమేశ్ ఎన్ని రోజులని ఉండగలడు ? రత్న—ఇల్లు పరాయి ఇల్లని అతడికి ఏనాడూ అనిపించలేదు. కాని, తన్ను రోజురోజుకూ బలంగా బంధిస్తున్న వలను కత్తిరించి, వీలయినంత తొందరగా అక్కడినుండి వెళ్ళిపోవాలని అతడు నిశ్చయించుకున్నాడు.

ఒక సాయంత్రం రత్న, రమేశుడిని బాంద్రా బీచికి తీసుకుని వెళ్ళింది. ఆకుపచ్చరంగుతో ఎండి విర్సిన కొన్ని రాళ్ళను దాటి, విశాలంగా ఉన్న ఓ రాతి మీద కూర్చున్నారిద్దరూ.

నిర్జనంగా ఉన్న ఆ ప్రదేశాన్ని చూసి, తాము ఉన్నది బొంబాయి అనే విషయమే మరిచిపోయాడు రమేశ్.

అస్తమిస్తున్న సూర్యుడు బంగారపు పళ్ళెంలా కనిపిస్తున్నాడు. 'నీ శక్తెంతో చూపు' అన్నట్టుగా ఎగసిపడుతున్న అలలను అందుకోవాలని సూర్యుడు ప్రయత్నిస్తున్నట్టుగా ఉంది ఆ దృశ్యం. సూర్యుడు గిరాగిరా తిరుగుతూ, అలలతో ఆడుకుంటున్నాడు.

రమేశ్ అన్నాడు:

"రత్నా, నాకు ఊరికి వెళ్ళటానికి అనుమతివ్వండి."

రమేశుడివైపు చూడకుండానే, అస్తమిస్తున్న సూర్యుడివైపే తదేకంగా చూస్తూ రత్న అంది

"ఒక షరతుమీద మాత్రమే పంపగలను."

"ఏమిటది ?"

"మీరు చదువు పూర్తి చేసి, డాక్టరయి, పెళ్ళిచేసుకోవాలి. ఇలా మాటిస్తే, రేపే వెళ్ళటానికి ఒప్పుకుంటాను."

రమేశుడు కొంచెం ఉద్రేకంతో "మీరు ఎంతో సులువుగా ఆ మాట చెప్పేస్తున్నారు. కాని నాకదంత సులువుగా అనిపించటంలేదు. మిమ్మల్ని అంత త్వరగా నేను మరిచిపోలేను. నన్ను మీరు అంత త్వరగా మరిచిపోగలరా ?" అన్నాడు.

రత్న—మనసు ఒక్కక్షణం తటపటాయించింది: "ఏం చెప్పను ? ఏం చెప్పను ?" అని.

ఆఖరికి ఆమె మనసు ఒక నిశ్చయానికి వచ్చింది. నెమ్మదిగా:

"ఊఁ మీరు వెళ్ళిన మర్నాడే నేను మిమ్మల్ని మరిచిపోగలను."

"అదెలా సాధ్యం ?"

"ఎందుక్కాదు ? మిమ్మల్ని గుర్తుంచుకుని మాత్రం ప్రయోజనమేముంది ? ఈ జబ్బుకు మరుపుకన్నా దివ్యౌషధం వేరేలేదు. నేను ఎప్పుడూ మిమ్మల్ని ఎక్కువగా పట్టించుకోలేదు. రేపు మీరు వెళ్ళిపోయినా, మళ్ళీ ఒక్కక్షణం కూడా మిమ్మల్ని తల్చుకుని బాధపడను...."

రమేశ్ కోపంతో "నాటకం చాలు రత్నా" అన్నాడు.

"నాటకమా !"

"అవును.... ఇన్నిరోజులూ నాతో మీరు నాటకమాడారు. నేను మీకంత చులకనైపోయానా ?"

"నాదంతా నాటకం, అభినయం అని ఒప్పుకుంటే, మీరు నన్ను సులభంగా మరిచిపోగలరా?"

రమేశ్ కోపోద్రేకంతో "ఇహ చాలు, మీ నిజరూపం ఈ రోజు బయటపడింది" అన్నాడు.

రత్న మొహం వివర్ణమైంది, కాని, మృదువుగా:

"రమేశ్!" అంది.

కోపగించిన బిడ్డలా ఆమెవైపు వీపుతిప్పి కూర్చున్నాడు.

"మిమ్మల్ని నొప్పించానా రమేశ్ ?"

రమేశ్ పలుకలేదు.

రత్న మెల్లిగా అతడి భుజంమీద చెయ్యివేసి:

"ఇటు చూడండి రమేశ్ ! నన్ను మరవటం మీ కెంత కష్టమో, మిమ్మల్ని మరిచిపోవటం నాకూ అంత కష్టంగానే ఉంది. కాని, జీవితంలో మళ్ళీ మనం కలుసుకోమేమో. మన జీవితాలు వేర్వేరు దిక్కుల్లో ప్రవహిస్తున్నాయి. అందుకే ఈ పిచ్చి వద్దంటున్నా. నిప్పులో చెయ్యిపెట్టి కాల్చుకోవటం మూర్ఖత్వం రమేశ్! కనుకనే ఇద్దరం ఒకర్నొకరు మరిచిపోవటానికి ప్రయత్నిద్దాం" అంది.

"ఎలా రత్నా! ఎలా?" రమేశుడి కంఠంలో ఆవేదన పొంగి పొరలింది.

"నాకు ఆశ ఉంది. మీకు...."

"నా కేముంది ?"

"మీకు అన్నీ ఉన్నాయి....."

"కాని, నాకు రత్న కావాలి" అంటూ, రత్న—చేతిని తన చేతిలోకి తీసుకుని ఆమెను తనదగ్గరగా లాక్కున్నాడు రమేశ్. రత్న కాదనలేదు. కాని శాంతంగా:

"అగ్నిలో ఆజ్యం పోస్తే మంట ఎక్కువ అవుతుంది. మనిద్దరి మధ్యా లేచిన ఈ మంటను మనం నీళ్ళుపోసి ఆర్పడానికి ప్రయత్నిద్దాం" అంది.

రమేశ్ చటుక్కున ఆమె—చెయ్యి వదిలేసి లేచి నిల్చున్నాడు.

"పదండి ఇక్కడినుండి వెళ్ళిపోదాం" అంటూ ఆమెకన్నా ముందుగానే బయల్దేరాడు.

"ఏం" అంటూ లేచింది రత్న.

"చీకటి పడింది, నిర్జన ప్రదేశం. దొంగ లెవరైనా వస్తే...." అంటూ వేగంగా అడుగులు వేయసాగాడు రమేశ్. రత్న అతడిని అనుసరించింది. బస్‌స్టాప్ దగ్గరకు వచ్చాక రత్న అడిగింది:

"ఎందుకలా పారిపోయి వచ్చారు ?"

"దొంగల భయం నాకు. నాకన్నా వేరే దొంగలు అక్కడ లేరనుకోండి. నామీద నా కా క్షణంలో నమ్మకం లేకపోయింది. ఇంకో క్షణం మనం అక్కడే ఉంటే, మిమ్మల్ని ఏం చేసేవాడినో చెప్పలేను. అందుకే అలా పరుగెత్తుకుని వచ్చేశాను....."

రమేశ్ నిష్కపటంగా వివరించాడు.

కల్లా కపట మెరుగని అతడి మొహాన్ని చూసి వాత్సల్యంతో అతడి చేయందుకుని మృదువుగా నొక్కి:

"నిజంగా మీ దెంత సహృదయం!" అంది.

"ఎందుకలా అంటారు ?"

"మీరు ఊరికి వెళ్ళి చదువు పూర్తిచేసి పెళ్ళి చేసుకోండి అందాకా నాకు శాంతి లేదు. మీ జీవితం నావల్ల నాశనం కాకూడదు రమేశ్! నేను మీ దగ్గరికి రాకుండా ఉండాల్సింది. చాలా దూరంగా ఉండిపోవాల్సింది...."

రమేశ్ కొంటెగా "మీరు నాదగ్గర కెప్పుడొచ్చారు? ఇప్పుడు నానుండి ఓ అడుగు దూరంలోనే ఉన్నారు" అన్నాడు.

రత్న తన పక్కగా నడుస్తున్న రమేశుడివైపు చూసింది. ఒక అడుగు దూరంలో నడుస్తున్నాడు.

అతడి కళ్ళు మెరుస్తున్నాయి. ఉంగరాల జుత్తు రేగి నుదుటిమీదకు పడుతోంది. రత్నకు అతడి నుండి ఒక్క అడుగుకూడా దూరంగా ఉండలేననిపించింది. వెంటనే అతడి దగ్గరగా వచ్చి:

"లేదు; మీకు చాలా దగ్గరగా ఉన్నాను" అంది.

రమేశ్ ఆమెవైపు తిరిగి చూడకుండానే, కుడి చేతితో ఆమెను తన దగ్గరికి లాక్కుని, సర్వదా ఆమెను రక్షించేవాడిలా ఆత్మవిశ్వాసంతో ముందుకు నడిచాడు. అతడేమీ మాట్లాడకపోవటంచూసి రత్న:

"ఏమీ మాట్లాడరేం ?" అంది.

"మాటల ఆవశ్యకత ఉందంటారా ?"

"ఊఁ, మన మాటల శబ్దమైనా మనల్ని హెచ్చరించ నివ్వండి. నాకు వాగ్దానం చేస్తారా ?"

"ఇప్పటికి నన్ను క్షమించండి మీరు నా దగ్గరగా ఉన్నారు ఇది కలో, వాస్తవమో నాకు తెలి

41—వ పేజీ చూడండి

# పొదుపుకోసం అమృతాంజన్ అట్టపెట్టెల్లో వస్తోంది

వేడు మన దేశపు ఆదాయము రక్షణ కొరకు అవసరము. సాధారణంగా పరిచితమైన అమృతాంజన్ డబ్బా తయారుచేయడానికి కావలసిన టిన్‌రేకు నేడు జాతీయ అత్యవసరాలకు కేటాయించబడినది. కాబట్టి దీనికిబదులు మేము క్రొత్త రకం పొదుపైన అట్ట పెట్టె వాడుతున్నాము. ఇంతేగాకుండా సీసాలో నమ్మకమైన అమృతాంజన్ అందజేయడానికి మోసంచేయడానికి వీలులేకుండా 'అలు'కాప్ ('Alu'-cap) తో సీసా సీలు చేయబడింది ■ పూర్వం ఎప్పటికంటే కూడా ఇప్పుడు మీకు అమృతాంజన్ ఎక్కువ అవసరము కండల నొప్పులు, బెణుకులు, గుండె జలుబులు, కీళ్ళ నొప్పులు, ఆరోగ్యం చెరచి నీరసపరచి అధికంగా కావలసిన ఉత్పత్తులను తగ్గించే రోగాలు నిర్మూలించడానికి సహాకరిస్తుంది.

*అమోఘమైనది, మిత వ్యయంతో కూడినది, అనేక విధాల ఉపయోగపడేది.*




అమృతాంజన్ అమోఘంగా పనిచేసే నొప్పుల నివారణిని మీరు కొనవచ్చు. ఇటువంటి మందులన్నిటికంటె దీనిలో గుణవహకమైన ఔషధాలు అధిక పరిమాణాల్లో ఉంటాయి. ■ దీనిలో ఏకమైయున్న మందులు బాధలను నివర్తించి వెంటనే ఉపశమనం కలిగించడానికి శరీర చర్మంలో అతి శీఘ్రంగాను లోతుగాను ప్రవేశిస్తాయి. ప్రతీసారీ మీకు ఏ నాలుగు వడ్లగింజల ఎత్తో అమృతాంజన్ కావలసి ఉంటుంది. ఇంట్లో ఇంటిల్లిపాదీ ఉపయోగించినా ఒక బుడ్డి నెలల తరబడి ఉపయోగానికి వస్తుంది.

# అమృతాంజనము

ఆరోగ్యం ఇస్తుంది

అమృతాంజన్ లిమిటెడ్ 14/15 ఎజ్ చర్చి రోడ్, మద్రాసు-4



గుండె జలుబు



కీళ్ళ నొప్పులు



తల నొప్పులు

JWT-AM-2225a

# కుటుంబంలో నానాటికి తగ్గిపోయే తండ్రి ప్రాబల్యం

సైబిల్ సిక్

నేటి యువతీ యువకుల్లో దీక్ష లేదని, కార్యశూరత్వం అడుగంటుతూందని, నిస్త్రాణమే ప్రబలిందని, వారికి ఆదర్శాలు లేవని, అతిశయాలు మెండనీ, వారు నానాటికీ పతనమైపోతున్నారని, లోకాన్ని నమ్మించటానికి ఏవేవో వ్యాసాల్ని, అభిప్రాయ సేకరణలను తరచుగా ప్రచురించే పత్రికలను చూచి ఆందోళన చెందే తల్లిదండ్రులు, ఉపాధ్యాయులు, యువజన శ్రేయోభిలాషులు, మానసిక తత్వశాస్త్రవేత్తలు ఇటీవల వెల్లడించిన సత్యాల్ని తెలుసుకొని నిశ్చింతతో ఊపిరి పీల్చుకోవచ్చును గతించిన ఆరునెలల్లోనూ, మానసిక తత్వ శాస్త్రవేత్త ఆచార్య డాక్టర్ లూకెర్ట్, పశ్చిమ జర్మనీలోని యాభై పైగా సెకండరీ పాఠశాలల్లోని 13—16 మధ్య వయసు గల విద్యార్థినుల అభిప్రాయాల్ని సేకరించాడు

"ఇంటా బయటా, పాఠశాలలో, ప్రాణ స్నేహితులమధ్యన మీరు చాలామంది వ్యక్తుల్ని కలుసుకుంటూ ఉంటారు చరిత్ర, వార్తాపత్రికలు, రేడియో, సినిమా, టెలివిజన్ మీకు పలువురు వ్యక్తులను పరిచయం చేస్తూ ఉంటాయి వీరందరిలో మీ అభిమాన వ్యక్తి, మీ ఆదర్శమూర్తి ఎవరు ? ఎవర్ని అనుసరించి మీ జీవితాన్ని తీర్చి దిద్దుకోవాలని ఆశిస్తారు ?" ఇదీ మొదటి ప్రశ్న సమాధానాల్లో ప్రతి మూడవ విద్యార్థినీ, తన బంధువు పేరో, స్నేహితుల పేరో తెలియజేసింది ప్రతి అయిదవ విద్యార్థిని తన తల్లిలాగా ఉండాలని కోరుకుంటున్నానన్నది

"సహజంగా ఆలోచించుకోగల ఆడపిల్లల గమ్యం వివాహము, కుటుంబ జీవితము" అని ప్రొఫెసర్ లూకెర్ట్ వ్యాఖ్యానించాడు

ఈ పరీక్షా ఫలితాల్లో తండ్రులకు చివరిస్థానమే లభించింది ప్రతి ఇరవయ్యో విద్యార్థిని మాత్రమే తన తండ్రి ఆదర్శ మూర్తిని భావిస్తున్నది కుటుంబంలో తండ్రి తరతరాలనుండి వస్తున్న తన స్థానాన్ని, ప్రాబల్యాన్ని నానాటికి కోల్పోతున్నాడన్న మానసిక తత్త్వశాస్త్రవేత్తల అభిప్రాయాన్ని ఈ ఫలితం బలపరుస్తున్నది

ప్రతిఒక్క ఆరో అమ్మాయి తన ఉపాధ్యాయినే తన ఆదర్శమూర్తని తెలిపింది అపారమైన విజ్ఞానము, మేధస్సు, నీతి, న్యాయము, సహజత్వము, మాయా—మర్మం లేకుండా విద్యార్థినులతో కలిసి మెలిసి ఉండటం ఉపాధ్యాయ కర్తవ్యానికి అత్యవసర మని వివరించబడింది ఇవే గుణగణాలను పేర్కొంటూ ఉద్యోగం చేసే యువతులు తమపై అధికారులను ఆదర్శ మూర్తులుగా ఎన్నుకోవటం జరిగింది ఈ పరీక్షలో,

నటీనటులకు చిట్టచివరి స్థానమే దక్కింది ప్రతి ఇరవై ముగ్గురిలోనూ ఒక్కరు మాత్రమే నటీనటులను తమ అభిమాన వ్యక్తులుగా పేర్కొన్నారు

బవేరియాలోని వృత్తి విద్య, సెకండరీ పాఠశాలల్లో గూడా ఇదేవిధమైన పరిశీలన జరిగింది వేయిమంది విద్యార్థులు, విద్యార్థినులు ప్రశ్నలకి లిఖిత పూర్వకంగా సమాధానాలిచ్చారు మీ కుటుంబాన్ని గూర్చి మీ అభిప్రాయం ఏమిటి ? అనే ప్రశ్నకు, నలభై శాతం పైగా మా రక్ష, మా దీక్ష, శాంతి, సుఖము, సౌభాగ్యము, స్వర్గము అని సమాధానమిచ్చారు పాతికాలపై అభిప్రాయాల్ని వ్రాస్తూ జీవనోపాధికి కావలసిన వృత్తి విద్యను అభ్యసించటమే గాదు, జీవితాన్ని గురించే నేర్చుకుంటాం అని తెలిపారు యాభై శాతం పైగా మతాన్ని గౌరవిస్తున్నారు ముప్పై ఎనిమిది శాతం క్రమం తప్పక చర్చికి హాజరవుతున్నారు ఒక్క శాతం మాత్రం నాస్తికులు నూటికి అరవై మందికి రాజకీయాల్లో అభిరుచి లేదు అతిక్లిష్ట పరిస్థితిలో ఉన్న యూరప్ రాజకీయాల విషయమై తమ అభిరుచిని తెలియపరచటానికి కొందరు విద్యార్థులు ససేమిరా ఒప్పుకోలేదు

(యు పి యస్) ★



పశ్చిమ జర్మని యువతీ యువకులు

సహజ సౌందర్యము...

చీర, కళానికేతన అభినందనముతో, ఆభరణములు గన్‌పత్ అభినందనముతో.

# మనోహరమైన రూపము కొరకు...లక్మే ఫేస్ పౌడరు!

లక్మే

లక్మే ఫేస్ పౌడరువలన మీ యొక్క సౌందర్యము, పెంపొందును. అది, మీ ముఖము మీద మచ్చలను కప్పి పుచ్చి, మీ రూపమును కోమలముగాను ప్రకాశవంతముగాను చేయును. ఈ పౌడరు 6 రంగులలో దొరకును.

నేచరెల్ • రేచల్ • గోల్డెన్ పీచ్ • రోజ్ కోరల్ • సన్ టాన్ గ్లోయింగ్ అంబర్



# వనితా వాణి

## వంటా - వడ్డనా

ఈ వారం (17—5—63) సంచికలో ప్రచురించబడ్డ వనితాలోకంలో శ్రీమతి (కుమారి) సి. సావిత్రిగారు వ్రాసిన "వంటా—వడ్డనా" అనే వ్యాసం చదివిన తర్వాత వారికి నా అభినందనలు తెలుపకుండా ఉండలేక పోతున్నాను. ఇలాంటి వ్యాసం నా అభిమాన పత్రికలో ప్రచురింపబడటం నిజంగా పాఠకులోకి అదృష్టమనే చెప్పాలి. నా అభిమాన పత్రికలో ప్రచురితమయ్యే ఉత్తరాలూ, విమర్శలూ, నేను ప్రతివారం చదువుతూంటాను. కొన్ని కొన్ని చదివితే, పనిలేక వ్రాసేవాళ్ళు వ్రాస్తుంటారని, ఈ శీర్షికలకై కేటాయించిన స్థలాన్ని నింపడానికే ప్రచురితలు ప్రచురిస్తూ ఉంటారని అనుకొనేవాణ్ణి. కాని, ఈ వ్యాసంమీద అభినందనలు తప్ప, విమర్శ వ్రాయడానికేమీ అవకాశం లేదు. అంత చక్కగా, నేర్పుగా వ్రాసిన శ్రీమతి (కుమారి) సి. సావిత్రిగార్కి పత్రికా ముఖంగా (అడ్రసు తెలియనందువల్ల) నా అభినందనలు అందజేస్తున్నాను.

ఆఁ.... సింగినాదం! వడ్డించడం గూడా పెద్ద పనేనా ఏమిటి? అని అనుకొనే ఆడవాళ్ళు చాలామంది ఉన్నారు. అవును; వంట చేయడంకన్నా వడ్డించడమే పెద్ద పని కుండలో ఉన్నది కంచంలో గుమ్మరించడం వేరు, పొందికగా ఏ కూర కా కూర వడ్డించింది వేరు.

ఒకసారి ఒకరింటికి (బాగా తెలిసిన వారింటికే) భోజనానికి వెళితే, మా మిలటరీలో వంగవాళ్ళు చేసే వడ్డనే బాగుంటుందనిపించింది కూరలన్నీ రుచిగానే ఉన్నాయి. కాని, ప్రతి కూర పళ్ళెంలో ముందే పెట్టి ఉంచడం చేత అవికాస్త మిక్స్చర్ అయి కూర్చున్నాయి. నా ఫ్రెండ్‌ను ఇదేమిటిరా, రోజూ మీ రిలాగే తింటారా అని అడిగాను. నే నమాయకంగా నా ప్రశ్నకు నా ఫ్రెండ్ తెల్లబోయి, ఏమైందని ఖంగారు—పడుతుంటే, ఇలా అన్నీ కలిసి పోయేటట్లు వడ్డించారేమిటిరా అన్నాను వాళ్ళ అమ్మగారితో కూడా చనువు, పరిచయం ఉండడంచేత, ఆవిడగారు వచ్చి, "కలిస్తే, ఏం నాయనా! అన్నీ వేరే వేరే తిన్నా, ఆ పొట్టలో అన్నీ కలవాల్సిందేగా" అని అడిగేసరికి, అలాంటివారికి ఎలా తెలియజెప్పాలో తెలియక, నేను నోరుమూసుకోవాల్సొచ్చింది. వాళ్ళ కేం తెలుసు; వేరే వేరే తినడంవల్ల కలిగే రుచుల సంగతి. ఆవిడగారన్న మాట కూడా నిజమే, అన్నీ ఆ పొట్టలో కలుసుకొనేవే. మన పొట్టలో ఒక్కొక్క కూరకు ఒక్కొక్క గది లేదు. ఐనా, అన్నీ కలిపి తినుటచే, ఏ ఒక్కదాని రుచీ, ఇదమిత్థంగా తెలియదు.

ఈ వ్యాసంలో రచయిత్రిగారు వ్రాసిన వజ్రాలలాంటి మాటలు పైన నేను చెప్పినటువంటి వారికి మార్గదర్శకాలు కాగలవనడంలో సందేహంలేదు. ప్రతి విషయాన్ని చక్కగా విడమరచి వ్రాశారు రచయిత్రి. ఇలాంటి వ్యాసాలు వనితలకే కాకుండా, పురుషులకు కూడా ఉపయోగపడ్తాయి.

జి. ఆర్. రంగారావ్ (కోయంబత్తూర్)

* * *

కొంతమంది పాఠకులకు పై శీర్షిక బాహ్యంగా చుల్కనగా గోచరించవచ్చు. కాని, అందులో అనేక సాధక బాధకాలున్నాయి. వాటినన్నిటిని విపులంగా రచయిత్రిగారు రచించినట్లయితే ఆ శీర్షికకు ప్రత్యేక ఆకర్షణ ఉండేది. "వంటా—వడ్డనా" అనే రెండు పనులు పరస్పరంగా నమ్మె నమ్మై ఉండాలి. ఆ రెంటిలో ఏ ఒకటి లోపించినా వృథా ప్రయాస అవుతుంది. వంట శుభ్రంగా లేకుండా, వడ్డనలో ఎంత నేర్పుగా— ఓర్పుగా పెట్టినప్పటికీ నిష్ఫలమే. అలా అని పంచభక్ష్య పరమాన్నాలు తయారుచేసి రచయిత్రిగారు పేర్కొన్నట్లు వడ్డన చేసినట్లయితే, తిండి మాత్రం దేవుడెరుగు గాని, ఆ అభ్యాగతులు మాత్రం మరొక మారు పిలిచినప్పటికీ రాకపోవడము తథ్యం మరొక విషయమేమంటే, "వంటా— వడ్డనా"తో బాటు ముఖ్యంగా ఆదరణ కనబరచాలి. నిజంగా కొంతమంది చూపిన ఆదరణతో, వచ్చిన అతిథులకు సగం కడుపు—నిండినంత పనౌతుంది. పై విషయాల్ని సక్రమంగా జరగాలి అంటే, ప్ర ప్ర థ మం గా ఇంటి ఇల్లాలికి నేర్పు— ఓర్పుతో బాటు "ఆదరణ" కూడా తప్పనిసరిగా ఉండాలి.

కృష్ణప్రియ (రూర్కెలా)

* * *

## అందమూ-ఆకర్షణ

10—5—63వ తేదీ వారపత్రికలో నిమ్మ రసము ఉపయోగించి దువ్వుకుంటే జుట్టు ఊ డి పో తు ం ది, ఊ డి పో కు ం డా ఏమి చేయాలి అని వ్రాసినారు. మా ఫ్రెండు కూడ ఈ విధము రెండు వారములు చేసినారు వారికక్కడ ఇదేమాదిరిగా జరిగినది. అదియునుగాక జుట్టు తెల్లబడుచున్నట్లు కనబడుచున్నది అందుచేత మీ ఫ్రెండ్సును ఈవిధముగా చేయమనండి.

సీకాయపొడితో కాని, కుంకుడి రసముతో కాని తలార స్నానము చేయవలెను. ఏవిధమైన సబ్బు తలకు పెట్టకూడదు. తరువాత తలను గుడ్డతో తుడిచి 5లేక 10 నిముషములు ఎండ నుంచుండవలెను తరువాత అయిదు ఆరు గంటల వరకు నూనె రాయకూడదు. మంచిది, శుభ్రమైన కొబ్బరి నూనె రాసి, తలను దువ్వుకొన్న యెడల కాంతివంతముగా నుండును మరియు వెంట్రుకలు ఊడవు.

వై. శ్యామలరావు (వరంగల్లు)

# వంటలు

## తియ్యమామిడి పచ్చడి

| | |
|---|---|
| మామిడికాయ | ఒక |
| ఎర్రమిరపకాయలు | 3 |
| బెల్లం సుమారు 150 గ్రాము | |
| ఆవాలు | చం |
| ఉప్పు | చం |

150 గ్రాములు సుమారు న్నా పలాలకి సమానం. మామిడికాయ పెద్దపెద్ద ముక్కలుగా తరిగి ఉప్పుతో బాటు ఒక కప్పుకి కొంచెం తక్కువగా నీటిలో ఉడకపెట్టిన తర్వాత బెల్లం చేర్చాలి. ముద్దగా అ నరకూ మరి కొంత ఉడికించి తక్కి పదార్థాలు చేర్చాలి. అవసరమయి రెండు మూడు చిటికెలు బియ్యం పిండి కలపవచ్చు.








### జరిగిన కథ

బెలూన్ల ప్రయాణ విధానం కనిపెట్టిన ఫాన్‌ఎగ్‌బర్గ్, ఆయన మిత్రుడు పాల్‌టేర్ షెల్డ్, అతని బావమరిది మారిస్ స్పీడార్, పని మనిషి ఫిలిప్పిన్‌లు బెలూన్‌లో ధ్రువయాత్రకు బయల్దేరుతారు. గ్రీన్‌లాండ్‌కు తూర్పుగా ఉన్న ద్వీపం చేరాక ఒకరోజుపాటు నీటిమీద ప్రయాణం చేస్తారు. వారికి నీటి సింహాలు ఎదుర్కొంటాయి. వాటిని జయించి కొన్ని రోజులకు ధ్రువం చేరుకుని తిరుగు ప్రయాణం ప్రారంభిస్తారు. దారిలో వారికి ఓ నౌక ఎదురౌతుంది దాని అధికారి ఎడ్వర్డ్ బర్నెట్‌తో పరిచయం సంపాదించుకుంటారు. బర్నెట్ సేవకుడొకడు రహస్యంగా బెలూన్ యాత్రికులదగ్గరికి వచ్చి, బర్నెట్ ముఠా బెలూన్‌మీద దాడి చేయదల్చుకున్న విషయం చెప్పగా మన యాత్రికులు ఎదురుదాడి జరిపి, నౌకలోని బందీగా ఉన్న నార్త్ బరో ప్రభువును విడిపిస్తారు. వాళ్ళకి సైబీరియా రాజధాని నగర మైదాన ప్రాంతంలో 'ఇవా' అనే చిన్న అమ్మాయి దొరుకుతుంది.

## 8

ఆ అమ్మాయి వెంటనే జవాబు చెప్పలేదు. బెదురుగా ఇటూ అటూ చూసి చివరకి ఫాన్ ఎగ్‌బర్గ్, మారిస్‌ల వంక నిలకడగా చూస్తూ అడిగిందినీరసమయినకంఠస్వరంతో:

"నేనిప్పు డెక్కడున్నాను?"

"స్టెప్పి (పచ్చికబయలు) మీద పడిఉండగా నిన్ను చూశాము. మేము ప్రయాణికులము."

"ఓ! నేను స్టెప్పెమీద దొరికా నన్నమాట ... అవును, ఇప్పుడు గుర్తుకి వస్తోంది...నిన్నటి నించి ఆహారం, నీరూ లేక తెలివితప్పి పడి పోయాను..."

"ఇప్పుడు ఆకలిగా ఉందా ఇవా?"

"ఓ! ఉందండీ... కాని నా పేరు మీ కెలా తెలుసు?"

"అమ్మాయి!" అన్నాడు పాల్. "నీ దగ్గరే దొరికిన మూటవిప్పి చూశాము. నువ్వెవరో ఏమిటో తెలుసుకోవాలి కదా!... అదలా ఉండనీ! ప్రస్తుతం ఈ బిస్కెట్, ఈ వయిన్ (Wine, పుచ్చుకో! కొంచెం కోలుకోవచ్చు... ఆ

తర్వాత నీ కథంతా, వీలయితే చెబుదువు గానిలే..."

ఇవా ఇంకేమీ అడగకుండా తనకు కావలసిన ఆహారం తీసుకుని తన కథంతా చెప్పింది.

ఆమె తండ్రి ఒక ప్రఖ్యాత రచయిత; విప్లవాత్మకమైన రచనలు చేసినందుకు బహిష్కరింపబడ్డాడు. 'నెర్‌టిన్‌స్కి'గనులలో జీవితాంతం వరకూ పనిచేస్తూ ఉండిపోవలసినదిగా ప్రభుత్వంవారు శాసించారు. ఆమె తల్లి పోలిష్ వనిత. అందువల్లనే నేమో తనూ అతనిని అనుసరిస్తానంటే, ఎవరూ అడ్డుపెట్టలేదు. అయితే యూరల్ పర్వతాలకి ఇవతలగా తిరిగి రావటానికి వీలు లేదన్నారు ప్రభుత్వంవారు. శ్రీమతి సోమోలెఫ్ నెర్‌టిన్‌స్కిలో తన చిన్న కూతురితో బాటు స్థిరపడిపోయింది. అధికారుల అనుమతితో తరచు భర్తను చూస్తూ ఉండేది.

అలెక్సిస్ సోమోలెఫ్‌కి 1871లో శిక్షపడింది. 1874 మే నెలలో మనస్సు విరిగిపోయి మరణించాడు. అతను చనిపోయిన నాలుగు వారాల లోపలే అతని భార్య కూడా అతనిని అనుసరించింది. అప్పటికి ఇవాకి పదమూడు సంవత్సరాలు; నెర్‌టిన్‌స్కిలో ఒకాయనవద్ద పనిమనిషిగా చేరింది. ఇక్కడే కొన్ని నెలలు ఉండిపోయింది.

1875 ప్రారంభంలో ఒక పోలిష్ కుటుంబం నెర్‌టిన్‌స్కి మీదుగా ఇర్కుట్‌స్క్‌కి వెడుతూ ఈ చిన్నపిల్ల విషాదపరిస్థితికి జాలిపడి తమతోబాటు యూరప్‌కి తీసుకుపోతామన్నారు.

ఇవా వెంటనే వప్పుకుంది. ఏప్రిల్‌లో ఆ కుటుంబంవారితో ఇర్కుట్‌స్క్‌కి బయలుదేరింది. దారిలో టార్టార్ (Tartar) దొంగలు పడ్డారు. తక్కినవారి సంగతి ఏమయిందో ఇవాకి తెలియలేదు కాని తను మాత్రం దొంగల ఖయిదీ అయిపోయింది. ఆమెను వారితోబాటు తీసుకుపోయారు టార్టారులు. కొన్నిరోజుల తర్వాత ఆమెను ఒక దేశదిమ్మరి తెగ నాయకురాలికి అమ్మివేశారు. ఈ ముఠా నాయకురాలు ఇవాని తన గుడారంలో పనులు చేసేందుకు నియమించింది.

మూడు నాలుగు నెలలలో ఈ ముఠావారు మరొక ప్రదేశానికి బయలుదేరారు. ప్రయాణం తూర్పుగా ప్రారంభించారు.

ప్రయాణం కొంతకాలం సాగింది. కొంచెం కొంచెంగా దేశదిమ్మరుల తెగ భాష అలవడింది ఇవాకి. ఎప్పటికయినా తన విడుదల సంపాదించుకొనగలనని ధైర్యం ఆమెకి ఉంది. ఎనిసెయ్ (Yenisei) నది కుడితీరం చేరుకొనగానే తప్పించుకునే ప్రయత్నం చెయ్యాలనుకుంది.

టిక్కెట్ క్లార్కు: ఏమయ్యా! రైలు ఉదయమైతే, యిప్పుడొచ్చి టిక్కెట్ అడుగుతున్నావ్ !

పెద్దమనిషి : రైలు టైములు మాకు తెలుసులేవయ్యా!

జవార్డ్ (మద్రాసు)

అప్పటికి టార్టార్ దుస్తులలో ఉన్నప్పటికీ సాధారణంగా తను వాడే వస్త్రాలు పారవెయ్యకుండా దాచింది. వీటిని వేసుకుని ఒక చీకటి రాత్రి తప్పించుకుని పారిపోయింది.

ఎన్నో రోజులు కాలినడకమీదే ప్రయాణం చేసింది; ఎక్కడయినా ఒక రష్యన్‌గ్రామం తగిలి తనకి ఆశ్రయం ఇచ్చే మనుష్యులు దొరుకుతారేమోనని. కాని ఆమె దురదృష్టంకొద్దీ ఎక్కడా మానవ నివాసస్థానమే సంభవించలేదు. ఇక దాహం, ఆకలిబాధ పడలేక తెలివి తప్పి పడిపోయింది. దాని తర్వాత బెలూన్ ప్రయాణికుల కంటపడింది.

"అమ్మాయి, ఇప్పుడేం చేద్దామని?" అని అడిగాడు ఫాన్ ఎగ్‌బర్గ్.

"అయ్యా!" అన్నది ఇవా విచారంగా "నాకొక్కటే గతి: ఎక్కడ ఏ ఊరు కనిపించినా దింపెయ్యండి. ఎటువంటి పని దొరికినా చేస్తాను. కనీసం ఒక ఊరు దగ్గర దింపినా సరే! ఏదో కొంచెం తినేందుకు ఆహారం ఇప్పించారంటే నడిచి వెళ్లిపోతాను. మీకు అభ్యంతరం లేదు కదా!"

"ఇవా, నిన్నిలా వదిలి వెళ్లలేము" అని సమాధానం ఇచ్చాడు ఫాన్ ఎగ్‌బర్గ్. "విను: ఈలోకంలో నీ కెవరూ లేరన్నావు కదూ!... కావలిస్తే మాతో వచ్చెయి. తర్వాత నీ భవిష్యత్తు గురించి ఆలోచిద్దాము."

"ఏమిటీ! ... నిజంగా నేనండీ!... నాకింత అదృష్టం పడుతుందని కలలోనైనా ఆశించలేదు! ... తప్పకుండా మీరు చెప్పినట్లు చేస్తాను! నా జీవితంలో మళ్లీ మీ మేలు మరువలేను...మీరు సెయింట్-పీటర్స్‌బర్గ్‌కి వెడుతున్నారా?"

"లేదు తల్లీ! ... మేము హాలండ్ దేశస్థులం; తిరిగి హాలండ్‌కే వెళ్ళిపోతున్నాము."

అంతవరకూ ఇవా బెలూన్ క్రింది పెట్టెకూడా రష్యాలో స్లెడ్జిలు మీద ప్రయాణానికి వాడే బళ్ళవంటి బండి అనుకుంది కాని పైన బెలూన్ చూసిన తర్వాత ఆమె ఆశ్చర్యానికి అంతులేదు. అసలు ఆ పెద్ద గోళాకారాన్ని ఏమి పేరు పెట్టి పిలుస్తారో ఆమెకి తెలి

—39 వ పేజీ చూడండి



# అపార్థం

'ఉమ'

"అంత దీర్ఘంగా ఏమిటి ఆలోచిస్తున్నావు రమా'' అని అడిగాను కారులో నా ప్రక్కనే కూర్చుని ఉన్న రమని.

మాట్లాడకుండా అంత నిశ్శబ్దంగా కూర్చోటం తన కలవాటు లేదసలు.

ఆలోచనలనుండి మేల్కొని "ఏమిటండీ" అంది ఉలిక్కిపడుతూ.

'ఆహాఁ! ఏమిటంతగా ఆలోచిస్తున్నావు' అన్నాను నవ్వి.

'మా రాధ—గురించండీ' అన్నది నిట్టూరుస్తూ.

రాధ అంటే మా రమకి ప్రాణం. ఆమె వచ్చి మా ఇంట్లో వారం రోజులు ఉంది ఇవాళే వెళ్లిపోయింది. ఆమెను రైలెక్కించే వస్తున్నాము మేము.

"ఆ అమ్మాయికేం, అందమైనది. చక్కగా మాట్లాడుతుంది. హాయిగా పాడుతుంది. చదువుకుంది. ఉద్యోగం చేస్తోంది. డబ్బుఉంది. నేడో రేపో ఏ అదృష్టవంతుణ్నో కట్టుకుని సుఖంగా ఉంటుంది. అసలింతకీ ఇంతవరకూ ఎందుకు చేసుకోలేదో నాకు బోధపడడంలేదు' అన్నాను తేలిగ్గా. ఆ అమ్మాయి గురించి రమ అంత బాధగా ఎందుకాలోచిస్తుందో నాకు అర్థంకాలేదు

‹ న్నగా నవ్వింది రమ. ఆ నవ్వులో విచారం నిండిఉంది.

"రాధని చూసినవాళ్లంతా అలాగే అనుకుంటారు. కాని, దానిగురించి పూర్తిగా తెలిస్తే మీ రిలా అనరు'' అంది

'అంటే?' అడిగాను ఆశ్చర్యంగా.

"అది వివాహం చేసుకోదట. మొన్నకూడా చెప్పిచూశాను. 'లాభంలేదు రమా! అది నా తరం కాదు' అంది. తను ప్రేమించి, తనను ప్రేమించిన వ్యక్తిని వదులుకుంది. అంత త్యాగం ఎందుకు చేసిందో కూడా నా కంతుచిక్కదు' అన్నది రమ

"ఎవ్వరూ ఊర్కే త్యాగం చెయ్యరు రమా! ఏదో కొంత స్వార్థంలేనిదే మానవుడే పనీ చెయ్యడు. కనీసం నలుగురు తనను పొగడాలనో, లేకపోతే మరెవరో తనకు ఆజన్మాంతం కృతజ్ఞులుగా ఉండాలనో అయినా అనుకుంటాడు; ఆశిస్తాడు'' అన్నాను.

"లేదండీ; రాధ అందుకోసం చేయలేదు. అసలు అది ఎవరికొరకు తన జీవితాన్ని ఇలా తయారు చేసుకుందో, వారికి ఈ సంగతే తెలియదు. వారికే కాదు, నాకుతప్ప మరెవరికీ నిజం తెలియదు'' అంది

ఇంటిముందు కారాపుతూ "నాకు చెప్పవా? రమా'' అని అడిగాను, అదేమిటో తెలుసుకోవాలన్న కుతూహలంతో.

"చెప్తాను. కాని, మీరెవ్వరికీ చెప్పనని మాట ఇవ్వాలి'' అంది.

'అలాగే' అన్నాను చేతిలో చేయివేస్తూ.

లోపలికి వెళ్లి డాబా ఎక్కి కూర్చున్నాం. 'చెప్పు రమా' అన్నాను; రమ చేతిని నా చేతిలోకి తీసుకొంటూ

రమ ప్రారంభించింది·

"అవి నేను ఇంటర్‌మీడియేటు చదివేరోజులు మా ఊళ్లో కాలేజీ లేదుగా. అందుకని విశాఖపట్నం వెళ్లాను. ఆడపిల్లలకి హాస్టలు లేదు. గది తీసుకొని ఉండాలి మా పిన్నిగారింట్లో దిగి, గది దొరకగానే వెళ్లిపోదా మనుకున్నా. కాని, అప్పటికే కాలేజీలు తెరచి నెలరోజులై పోవటాన్ని, గదే దొరకటంలేదు. ఏదో మాటల సందర్భంలో ఈ మాటే మా వెయిటింగ్ రూంలో అన్నాను

రాధ. 'నేనూ రూంలోనే ఉంటున్నానండీ అంత పెద్ద గదిలో ఒక్కర్తినీ ఉండలేక మార్చేద్దా మనుకుంటున్నాను కూడా. మీ కభ్యంతరం లేకపోతే, మనం కలసి ఉండవచ్చు' అంది.

నాకు రాధతో అప్పటికి పెద్దపరిచయంలేదు. ఏదో ఒకటి రెండుసార్లు మాట్లాడానేమో. కాని ఆమె అంటే నాకు ఒకలాటి ఇష్టం కల్గింది. అందమైన ముఖం, చురుకైన కళ్లు, నవ్వుతూ నవ్విస్తూ తిరిగే తత్వం నన్నెంతో ఆకర్షించాయి.

"అలాగేనండీ'' అన్నాను మరో ఆలోచన లేకుండా

'అయితే రేపు ఆదివారమేగా. మారిపొండి' అంది

మేం అలా రూంమేట్స్ అయ్యాం. తర్వాత ప్రాణస్నేహితుల మయ్యాం. ఇంటరు సెకండియర్‌లో ఉండగానే ఆమెకు తరచు వాళ్లబావ దగ్గర నుండి ఉత్తరాలు వచ్చేవి. నేను వెక్కిరిస్తూ ఉండే దాన్ని.

"అబ్బే, ఏమీలేదు రమా! ఏదో కాలక్షేపానికి వ్రాసుకోవటం తప్ప'' అనేది. కాని, బావ అంటే ఆమెకు చాలా ఇష్టమని మాత్రం చెప్పింది. ఇంటరయిపోయింది. ఇద్దరం ఆనర్సులో చేరాం. హాస్టల్లో కూడా మేం ఒక్కగదిలోనే ఉండేవాళ్లం. అప్పుడు చెప్పింది సెలవల్లో వాళ్ల బావ అమెరికా వెళ్లాడని. వెళ్తూ ఉంటే తను అడిగిందట: 'ఏం చదవను, బావా' అని 'ఆనర్సులో చేరి పూర్తి చెయ్యరాదా? నాకు అదే మంచిదనిపిస్తోంది?' అన్నాడట. అలాగే ఆనర్సులో చేరింది; అసలు బి. ఏ చదివి 'లా'లో చేరాలని అనుకున్న రాధ.

మొదటి సంవత్సరంలో అంతా ఉత్తరాలు వచ్చేవి. తనూ తరచు రాసేది. ఆ సెలవుల్లో ఇళ్లకెళ్లాం. మళ్లా వచ్చేసరికి రాధలో నే నూహించలేని మార్పు వచ్చింది. ఆ చురుకుతనం పోయింది. ఏదో పోగొట్టుకున్నట్లు ఉండేవి కళ్లు. ఎప్పుడూ ఏదో ఆలోచిస్తూ ఉండేది ఒక్కొక్కసారి రాత్రి మెలకువ వచ్చి చూస్తే, వెక్కివెక్కి ఏడుస్తూ ఉండేది.

"ఎందుకు రాధా? నాతో చెప్పవా? ఇంతేనా మన స్నేహం'' అని బతిమాలేదాన్ని.

కాని "వద్దు రమా! నన్ను చెప్పమని అడగకు. ఇప్పుడు చెపితే మంచిదికాదు. ఎప్పుడో ఒకరోజు నేనే చెప్తాను. నన్ను బలవంతం చెయ్యకు. ఈ ఒక విషయం నీ దగ్గర దాస్తున్నందుకు నన్ను మన్నించు'' అనేది నా వళ్లో పడుకునే.

అలా అంటున్నదాన్ని ఏమని బలవంతం చెయ్యను? ఏమీ చెయ్యలేక ఊరుకునే దాన్ని దానికి ఉత్తరాలు వచ్చేవి. కాని, జవాబులు వ్రాసేది కాదు. ఒక్కొక్కసారి చదవకుండానే పడేసేది. వాళ్ల బావ—ఫొటో మాత్రం ఎప్పుడూ టేబిలుమీదే ఉండేది. నా కేమీ అర్థమయేదికాదు. పోనీ, వాళ్ల నాన్నగారు ఏమైనా అన్నారేమో అంటే 'ఏ విషయంలోనూ మా నాన్నగారు నా ఇష్టాన్ని కాదనరు రమా'' అని ఎన్నోసార్లు నాతో చెప్పింది. అడిగితే ఏడుపుతప్ప మరే సమాధానం రాదు. అందుకని నా కేమీ తెలిసేదికాదు.

అలాగే కాలం గడిచిపోయింది కడపటి సంవత్సరంలోకి వచ్చాక వాళ్ల బావ వచ్చాడని చెప్పింది. కాని, ఎక్కడా సంతోషమే లేదు ముఖంలో అన్నాళ్ల తర్వాత స్నేహితుడు వస్తేనే, ఎంతో ఆనందంగా ఉంటుందే, అలాంటిది తను ప్రేమిస్తున్న బావ తనను ప్రేమిస్తున్న బావ, పెళ్లిచేసుకోబోయే వ్యక్తి వస్తున్నాడంటే ఎంత ఆనందంగా ఉండాల్సింది? అలాటిది, ఆ ఆనందంలేదు సరికదా, ఏదో ఆందోళన, భయం, దుఃఖం—ఇవీ నాకు ఆమెలో కనిపించినవి.

పండగ సెలవల్లో ఇంటికి వెళ్లలేదు చదువుకోవాలనే సాకుతో. ఒకరోజు లైబ్రరీ నుండి ఇంటికి వచ్చేసరికి ఆమెపేర ఒక పెళ్లి శుభలేఖ మరో ఉత్తరం ఉన్నాయి. ఆ శుభలేఖ చూశాక, విచారం, సంతోషం—రెండూ కలిసి కనిపించాయామె మొఖంలో. ఏదో బరువు తీరిపోయినట్లు నిట్టూర్పు విడిచింది. నా చేతికి ఇస్తుంది అనుకున్నాను కాని ఇవ్వకుండా ఉత్తరం తీసి అది చదువుతూనే తెల్లగా పాలిపోయింది. నేను అర్థం కాక, అలాగే నిలబడ్డా. ఆమె కళ్లవెంబడి నీళ్లుకారి, ఆమె చేతిలోని ఉత్తరంమీద పడ్డాయి

'రాధా' అన్నాను ఆమె భుజంమీద చెయ్యివేసి.

'రమా' అంది నన్ను కౌగలించుకొని బావురుమంటూ,

'ఏమయింది రాధా' అన్నాను ఆమె—[illegible]రుతూ.

ఏదో చెప్పబోయి, మళ్లీ ఏమనుకుందో 'ఏంలేదు రమా' అంది కళ్లు తుడుచుకుంటూ. కాని ఆమె దుఃఖం ఆగడంలేదు. నాతో పంచుకోడానికి ఇష్టం లేదనుకుని ఆమె నొక్కర్తినీ 'రూం'లో వదలి వెళ్లిపోయాను. తర్వాత కూడా నా కేమీ చెప్పలేదు.

ఫైనల్ పరీక్షలు రాసేశాం. ఆఖరి పరీక్ష వ్రాసి వచ్చాం. రాధపేర రిజిస్టర్డు కవరు వచ్చింది; విప్పి తీసింది. ఒక ఫొటో, ఒక ఉత్తరం. ఫొటో చూసి, నాకిచ్చింది. చూశాను. ఆశ్చర్యంతో ఫొటో చేతిలోంచి జారిపోయింది. అది ఒక పెళ్లిఫొటో. రాధావాళ్ల బావ, మరొకమ్మాయి. ఆ అమ్మాయి కూడా అందంగానే ఉంది. రాధ పోలికలు ఎక్కడో కనిపిస్తున్నాయి. వంగి ఫొటో తీశాను. వెనకాల 'రాధక్కకు ప్రేమతో లీల' అని వ్రాసిఉంది.

'ఏమిటి రాధా ఇది?' అన్నాను.

మాటాడకుండా చేతిలోని ఉత్తరం ఇచ్చింది. చిన్న ఉత్తరం అది:

"ప్రియమైన రాధక్కకి,

అక్కా, నువ్వు మా పెళ్లికి వస్తావని, ఎంతో ఆశతో ఎదురు చూశాను. ఆఖరి క్షణంలోనైనా వస్తావనుకున్నాను. కాని ఎందుకో నువ్వు రాలేదు. పరీక్షలని రాలేదా అక్కా? అలా అయితే ఒక ఉత్తరం అన్నా వ్రాయలేదేం? నా మీద కోపం వచ్చిందా? నే నేం చేశానక్కా? పోనీలే. నువ్వు రాకపోయినా, నేను నీ పెళ్లికి తప్పక వస్తాను. బావగారి చదువు ఈ సంవత్సరంతో అయిపోతుంది కదా? పెళ్లెప్పుడు? నాకు చెప్పవా?

బావ కులాసాగానే ఉన్నారు. ఎందుకో కాని నీ పేరెత్తితేనే చికాకు పడుతున్నారు. నా కర్థం కావడంలేదు. నువ్వు పెళ్లికి రాలేదని కోపమేమోలే పోనీ, పరీక్షలైపోయాకైనా మా ఊరు రా. రెండు రోజులుండి వెళ్దువుగాని.

ఇందుతో మా పెళ్లిఫొటో పంపుతున్నా. బాగుందా? జవాబుకోసం ఎదురుచూస్తూ ఉంటాను.

"నీ చెల్లెలు, లీల.''

చదివాను, కాని, ఏమీ అర్థంకాలేదు.

'ఏమిటి రాధా! నా కేమీ బోధపడటంలేదు' అన్నాను ఉత్తరం మడుస్తూ.

నవ్వింది: "ఇన్నిరోజులూ నేను నీ దగ్గర దాచిన విషయం ఇదే రమా! నీకు ఎప్పుడో ఒకసారి నేనే చెప్తానన్నానుకదా. ఇంక చెప్పవచ్చు, చెప్తా విను.'' అని మొదలుపెట్టింది:

'నాకు ఇంటర్‌లో బావదగ్గరనుండి ఉత్తరాలు వచ్చేవి గుర్తుందా? అప్పుడు మాకు ఏ విధమైన అభిప్రాయమూ ఉండేదికాదు ఒకరంటే ఒకరికి. అన్ని విషయాలగురించీ చర్చించుకునే వాళ్లం. ఒకరి అభిప్రాయా లొకరికి తెల్పుకునేవాళ్లం. అప్పుడే నాకు బావఅంటే అదొక రకమయిన ఇష్టం కల్గింది. బావది అతి సున్నితమయిన హృదయం తొందరగా ఒక నిర్ణయానికి రాడు. ఏదన్నా ఒక నిర్ణయానికి వస్తే మార్చుకోడు. ఎవరిమీదా సాధారణంగా కోపంరాదు. వచ్చిందంటే దాన్ని పోగొట్టటం బ్రహ్మదేవుడి తరం కాదు. తన

—33 వ పేజీ చూడండి

## గ్రహస్థితి

వృషభంలో బుధ, శుక్రులు; వృషభ, మిధునాలలో సూర్యుడు; మిధునంలో రాహువు; సింహంలో అంగారకుడు, ధనుస్సులో కేతువు; మకరంలో శని; మీనంలో గురువు, కుంభ, మీన, మేష, వృషభాలలో చంద్రుడు.

### మేషం :

**(అశ్వని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ సమయంలో అదృష్టం కలిసివస్తుంది. మీ కోరికలను అధికారులు ఆదరించి నెరవేర్చ గలుగుతారు. ఇంతకుముందు నమ్ముకొనిఉన్న పద్ధతులను క్రమంగా మార్చుకొని, క్రొత్త మార్గాలలో ధన గౌరవాలను పొంద గలుగుతారు. కుటుంబంలో ఒకానొక సమయంలో అశాంతి సూచనలు కనుపించినా, ఈ వారం మొత్తంమీద సుఖ సంతోషాలతో జరుగుతుంది. ప్రస్తుతం బాహ్య ఆడంబరములయందు విసుగుదల తోస్తుంది. ఒకదాని వెనుక మరొకటిగా కార్యభారం పెరుగుతున్నా, ఉత్సాహంతో సాధించుకొంటూపోతారు. బంధువులవద్దనుంచి సంతోష వార్తలు తెలుస్తవి. ధనం విశేషంగా వచ్చి, ఖర్చు అవుతుంది. వారం చివరి భాగంలో మిత్రులను కలుసుకొంటారు. 14, 15 తేదులలో దైవ కార్యాలు, శ్రమకరమైన పనులు.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

స్నేహితులు మీకు ప్రోత్సాహాన్ని కలుగజేస్తారు. అటుతరువాత సర్వము మీరే నిర్వహించుకొని, ఉన్నత స్థితిని సాధించుకొంటారు. దైవానుగ్రహం వల్ల అవకాశాలు కలిసివస్తవి. విందులు, వినోదాలు మొదలయిన వాటిలో పాల్గొంటారు. వ్యాపార వ్యవహారాలలో మీ మాట విలువ బాగుంటుంది వెదకబోయిన తీగ కాలికి తగిలిందన్నట్లుగా, ధన సహాయం లభిస్తుంది. కోర్టు కచేరీలలో ఆలస్యము, నిరుత్సాహ సూచనలు కనుపించినా, అంతమాత్రాన అధైర్యపడవలసిన అవసరంలేదు. పిల్లల మూలంగా సంతోష సుఖాలు లభిస్తవి. విరోధుల బెదరింపులు మిమ్ములను ఏమీ చేయజాలవు. ప్రయాణం చేస్తారు. 15, 16 తేదులలో శుభవార్తలు, మంచివారితో స్నేహం, కార్యసిద్ధి.

* * *

### మిధునం :

**(మృగశిర 3, 4 పా., ఆరుద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఈ వారం అన్ని పరిస్థితులు చాలా బాగానే ఉంటవి. అయితే శ్రమపడి, మంచి పేరు లేకుండా పోయే అవకాశాలున్నవి. వృత్తిలో ఉంటున్న ఆటంకాలు, అసంతృప్తి చాలావరకు తగ్గిపోతవి. ధనం






దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**14-6-1968 శుక్రవారము మొదలు**
**20-6-1963 గురువారము వరకు**

ఖర్చు అయినా, గౌరవం దక్కుతుంది. నౌకరుల మూలంగా దండుగ ఖర్చులు గాని, కార్యభంగ సూచనలు గాని కనుపిస్తవి. ఇతరుల తగాదాలలో జోక్యం వల్ల చివరకు మీరే వెనుకకు తగ్గవలసిన పరిస్థితులు ఏర్పడవచ్చు. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. అధికారులను కలుసుకొని ఆదరాభిమానాలను పొంద గలుగుతారు. క్రొత్త కార్యకలాపములు ఆరంభించటంవల్ల శక్తికి మించిన భారం పైన పడుతుంది. అన్నిటికన్నా, ధన విషయంలో ఎక్కువ ఆందోళన కలుగవచ్చు. 16, 17 తేదులలో గౌరవం, శారీరకంగా శ్రమ, ధనలాభం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

అన్ని సౌకర్యాలు అందుబాటులో ఉంటవి. ఏ పని అనుకొన్నా చురుకుగా చేయుగలుగుతారు మీకు తెలియకుండా మీ మాటలో కొంత కాఠిన్యం గోచరిస్తుంది. అయితే ఈ సమయంలో న్యాయం సాధించి, గౌరవం పొందగలుగుతారు. ఆదాయం బాగుంటుంది. సుఖము, శాంతి లభిస్తవి. ఇంతకు ముందు ఆశ వదులుకొన్న పనులు తలవని తలంపుగా అనుకూలిస్తవి. వృత్తి, ఉద్యోగాది కార్యకలాపాలలోను, ఉత్తరాలు మొదలయినవి వ్రాసే సందర్భాలలోను, పూర్వాపర సందర్భాలను ఆలోచించి, ఒక నిర్ణయం చేసుకొంటూ, ముందుకు పోవలసిన సమయం. స్వవిషయంకన్నా పదిమందికి సంబంధించిన పనులే అధికంగా ఉంటవి. ధర్మ కార్యాల నిమిత్తం పూనుకొనవలసి రావచ్చు. మీ మాట విలువవల్ల సహాయం చేయుగలుగుతారు. 17, 18 తేదులలో విసుగుదల, దుబారా.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

అన్ని విధాలా గ్రహస్థితి బాగున్నది మీరు ఒక మాట చెప్పగానే, పదిమందీ సంతృప్తితో ఆమోదిస్తారు. అధికారము, హోదా పెరుగుతవి. వృత్తి, వ్యాపారాదులలోనే కాకుండా, వ్యవహార రంగంలో కూడా విజయం లభిస్తుంది. ఇంతకుముందు

## ఈ వారము ధరలు

నూలు ధర క్రమంగా పెరుగుతుంది. **ప్రత్తి ధరలో పెద్ద మార్పులు ఉండవు. వేరుశనగ నూనె ధర తగ్గుదలలో ఉంటుంది, నూవుల ధర ముందు పెరిగినట్లు కనుపించి** వారం రెండవ భాగంలో తగ్గవచ్చు. రంగుల ధరలలో తలవని తలంపుగా హెచ్చుతగ్గులు కనుపించగల అవకాశాలున్నవి.

మిమ్ములను విసిగించినవారే ఈ సమయంలో విశ్వాసంతో పని చేస్తారు. క్రొత్తవారితో పరిచయం లభిస్తుంది. ఇంతకుముం దున్నటువంటి భయ సందేహాలు తొలిగి, మనశ్శాంతి లభిస్తుంది. ఒక సమయంలో ఇతరుల కష్ట వార్తలు తెలియుటం వల్ల తాత్కాలికంగా చింత కలుగుతుంది. సంఘంలో పలుకుబడి పెరుగుతుంది. మీ క్రిందివారిమీద నమ్మి వదిలిన పనులను తిరిగి మీరే సమర్థించుకొనవలసి వస్తుంది. ప్రయాణ సూచనలున్నవి. వారం చివరలో కుటుంబంలో అనారోగ్యాలు కనుపిస్తవి. 18, 19 తేదులలో దేహశ్రమ, స్వల్ప లాభం.

* * *

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

ప్రయత్నంతో ప్రతిబంధకాలను తొలగించుకొంటారు. వృత్తి ఉద్యోగాలలో మీ మాట సాగుతుంది. విశేష ఫలితాలను ఎదురుచూచి, ఆపత్రయపడతగిన సమయంకాదు. వ్యవహారాలలో మీరు అనుసరిస్తున్న మార్గం మీరు ఊహించినంత సులభంగా కనుపించదు. అప్రయత్నంగా బంధుమిత్రుల సహాయం లభిస్తుంది. సాధ్యమైనంత వరకు ఒక్కొక్క పని పూర్తి చేసుకొంటూ, ముందుకు సాగటం అవసరం. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. బంధుమిత్రుల వలన అదనపు ఖర్చులు తగలగల సమయం. ఈ సమయంలో శక్తికి మించిన పనుల మీదనే ఆలోచనలు సాగుతవి. ముఖ్యమైన కాగితాలు మొదలయినవి జాగ్రత్తగా ఉంచుకొనటం అవసరం. 19, 20 తేదులలో ఆదాయభంగం, నిరుత్సాహ వార్తలు.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ, 1, 2, 3 పాదాలు)**

ఈ సమయంలో ఆత్మీయులవల్లనే మనస్సుకు చికాకు కలుగుతుంది. మధ్యమధ్య ఆదాయం మందంగా ఉన్నట్లు తోచవచ్చు. కాని, మీరు ఎదురచూచిన దానికంటే, అధికంగానే ఫలితం పొంద గలరు. పరిస్థితులకు తగినట్లు నిబ్బరంతో నడచుకొనటంలోనే మీ నేర్పు చూపించవలసి ఉంటుంది. విద్యావిషయక గోష్ఠులలో పాల్గొంటారు. వృత్తిలో ఆర్థికంగా అంతస్తు, అధికారము

వారి సహాయం, సంబంధాలు ఏర్పడుతవి. ప్రస్తుతం ఆరంభించే ఏ వ్యవహారమైనా ముందుగా యోచించుకొనటానికి అవకాశం లేకుండా పోతుంది. కొన్ని సమయాలలో తొందరవల్ల ఒకటి మాట్లాడదామనుకొని, మరొకటి మాట్లాడతారు. 17, 18 తేదులలో వృత్తిలో శ్రమ అధికం, కుటుంబ కలహాలు.

* * *

## వృశ్చికం:

(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ)

మీవల్ల ఏ స్వల్ప కారణం కనుపించినా, అపవాదు మీమీద వేయటానికి ప్రయత్నించేవారుంటారు. మీ వ్యవహార సమస్యలు ప్రశాంతంగా పరిష్కారమవుతవి. అయినవారివల్ల ఆర్థికంగా కష్టనష్ట సూచన లున్నవి. ఒక సమయంలో సౌమ్యంగా ఉందామని అనుకున్నా, తలవని తలంపుగా పట్టుదలల పెరగదగిన వాతావరణం ఏర్పడుతుంది. ఉత్తర దిశనుంచి వచ్చు వార్తలు మీ మనస్సుకు శాంతిని చేకూర్చగలవు. ఉష్ణాధిక్యంవల్ల జీర్ణకోశాలలో బాధ కలుగుతుంది. ప్రత్యేకంగా నిర్వహించవలసిన కార్యభారం లేకపోయినా, విశ్రాంతి మాత్రం దొరకదు. వృత్తికి సంబంధించిన బాధ్యతలను చక్కగా నిర్వహించ గలుగుతారు.

* * *

## ధనుస్సు:

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా)

తరుచు ఉత్సాహ—నిరుత్సాహాలతో కాలం జరుగుతుంది. ప్రత్యక్షంలో చెప్పుకోతగిన లాభ—నష్టాలు ఏవీ ఉండవు. అనుకున్న పనులు కార్యరూపం పొందకుండా, కాలం గడచి పోతుంది. ప్రయాణాలు చేస్తారు. క్రొత్త వృత్తి వ్యాపారాదులను గురించిన ఆలోచనలు వస్తూ ఉంటవి. కుటుంబంలోని వారికి అనారోగ్య సూచనలు కనుపించగలవు. గౌరవార్థంగా భరించవలసిన ఖర్చులు క్రమంగా పెరుగుతవి. కలహించుకొనే మనుష్యుల మధ్య ఐక్యం కలిగించుకొని సర్దుబాటు చేయవలసిన అవసరం కలుగుతుంది. ప్రస్తుతం విశేష వ్యయ ప్రయాసలతో కూడిన కార్యకలాపాలను ఆరంభించటం మంచిదికాదు. 15, 16 తేదులలో శ్రమవలన కార్యానుకూలత, వస్తు నష్టము, ఆందోళన.

* * *

## మకరం:

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా, శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా)

గత కాలంలోని అనుభవం వల్ల మనస్సుకు ఆందోళన కలుగుతున్నా, యథార్థంగా పరిస్థితులలో అనుకూలమైన మార్పును తెలుసుకో గలుగుతారు. వృత్తికి సంబంధించిన లావాదేవీలు ధారాళంగా జరుగుతూ ఉంటవి. రావలసిన ధనం సకాలంలో చేతికి వస్తుంది. బంధు మిత్రులలో మీయందు సదభిప్రాయము, గౌరవ భావము కలుగుతవి. అకస్మాత్తుగా ప్రయాణం చేయవలసిన అవసరం ఏర్పడుతుంది. శారీరకంగా శ్రమ ఉన్నా, బుద్ధి బలంతో మీ పనులను సాధించుకొంటారు. అప్పుడప్పుడు మీ కర్తవ్యాన్ని ఇతరులు జ్ఞాపకం చేస్తూ ఉండవలసివస్తుంది. ఆర్థిక చిక్కులు క్రమ క్రమంగా తగ్గిపోతవి. ఇతరులకు సలహా చెప్పటం వల్ల చిక్కులు వస్తవి. 19, 20 తేదులలో నిరుత్సాహం, ఖర్చు.

* * *

## కుంభం:

(ధనిష్ఠ 3, 4 పా, శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

అన్ని విధాలా ఉత్సాహకరమైన సమయం. సంఘ కార్యాలలో ఉన్నత స్థితి లభిస్తుంది. చేతినిండా పుష్కలంగా డబ్బు వస్తుంది. ఇతరుల ఆక్షేపణలను, హాస్యాలను లెక్క చేయకుండా, మీ మార్గంలో పేరు ప్రతిష్ఠలను సంపాదించుకొంటారు. ప్రస్తుతం స్నేహితులసలహాలు మిమ్మలను పెడదారిని పట్టించేవిగా ఉండవచ్చు. ముందు జాగ్రత్త మంచిది. వృత్తిలో ఎవ్వరితోను అభిప్రాయ భేదాలు రాకుండా పదిమందినీ మెప్పించ గలుగుతారు. అజాగ్రత్తవల్ల మోసపోగల సూచనలు ఏర్పడి, వాటినుండి తప్పించుకొంటారు. మీరు ఆసక్తితో ప్రయత్నించి పొందలేకుండా ఉన్న వస్తువులు ఈ తరుణంలో పొందగలరు.

* * *

## మీనం:

(పూ. భాద్ర 4 పా, ఉ. భాద్ర, రేవతి.)

ఈశ్వరానుగ్రహం బాగున్నది. మనోబలం వృద్ధి అవుతుంది. ఎక్కడి కక్కడ ముందు చిక్కు రాని పద్ధతిలో వ్యవహారాలు సాగిస్తారు. విరోధుల క్రూర దృష్టి మిమ్ములను ఏమీ చేయజాలదు. గౌరవ మార్గంలో వృత్తి ఉద్యోగాలు సాగుతవి. కుటుంబంలో శుభ లక్షణాలు కనుపిస్తూ ఉంటవి. అయితే గోరంత విషయాన్ని కొండంత చేసి, మిమ్ములను కంగారు పెడుతూ, తాము కంగారుపడే వ్యక్తులు తటస్థపడతారు. విలువ గల వస్తువులు కొంటారు. వారం రెండవ భాగంలో [illegible] క్రింది భాగాలలో బాధ కలిగే అవకాశాలున్నవి [illegible] ఎంతైనా వచ్చి, ఖర్చు కాతగిన సమయం. 17, 18, 19 తేదులలో శుభవార్తలు, ఆదాయవృద్ధి. ★



పొగ తాగకపోతే ఏమవుతుందో శ్రీ గిరీశం చెప్పినా ఆయన సిద్ధాంతం ఈ జన్మకు వర్తించదు. ఈ జన్మలో జరిగేవి చాలా ఉన్నాయి. కాని, వీటిలో మనం రెండింటిని గురించి మాత్రం ఆలోచిస్తే చాలు: 1. ధననష్టం, 2. ఆరోగ్య నష్టం.

పొగాకు కాల్చేవారి ధన నష్టం సరేసరి. ఆరోగ్య నష్టం సంగతేమిటి? కొన్ని పశ్చిమ దేశాలలో—ఇటీవల మన దేశంలోనూ—ధూమపానానికీ, ఆరోగ్యానికీ మధ్య గల సంబంధాన్ని గురించి తీవ్రంగా పరిశోధనలు జరుపుతున్నారు. ఇప్పటివరకూ తెలిసిన ముఖ్యమయిన విషయాలు కొన్నిటిని పరిశీలించవచ్చు.

ఇంగ్లాండ్, వేల్సులలో ఊపిరితిత్తుల పుట్టకురుపు (లంగ్ కాన్సర్) వల్ల కలిగే మరణాల వివరాలు ఈ క్రింది విధంగా ఉన్నాయి:

| | పురుషులు | స్త్రీలు |
|---|---|---|
| 1920......... | 309 | 191 |
| 1930......... | 2,258 | 864 |
| 1960......... | 18,882 | 3118 |

అంతేకాదు—ఇటీవల ఊపిరి తిత్తుల కాన్సర్ వల్ల చనిపోయిన వారిలో వయసు తక్కువ ఉన్న వారే అధికులు అని తెలుస్తోంది. అంటే, కాన్సర్ సంభవింపజేసేది ఏదయినాసరే క్రమంగా ఎక్కువ అవుతోందని ఊహించవచ్చు.

ప్రపంచ ప్రజలలో క్రమంగా అధికం అవుతూ వచ్చిన, ఊపిరితిత్తులకి సంబంధించిన, 'విశేషం' ఏమిటి అని ఆలోచించి చూస్తే ఈ శతాబ్దం ప్రారంభంలో బాగా వాడుకలోకి వచ్చిన సిగరెట్లు కాల్చటమే నని అనుమానించవలసి వస్తుంది. ఊపిరితిత్తుల పుట్టకురుపు వచ్చిన వారిలో ధూమపానం అలవాట్లు ఎలా ఉన్నాయో పరిశీలించి చూస్తే ఈ అనుమానం నిజమో కాదో తెలుస్తుంది. ఈ విషయమై బ్రిటన్, అమెరికా మొదలయిన దేశాలలో తీవ్రమయిన పరిశోధనలు జరుగుతున్నాయి.

ఇంతవరకూ తెలిసినది ఏమిటంటే, పొగ తాగని వారిలోకన్నా, సిగరెట్లు కాల్చేవారిలో ఊపిరితిత్తుల కాన్సర్‌వల్ల మరణించేవారి సంఖ్య సుమారు ముప్ఫయిరెట్లు అధికం అని (పైపులు కాల్చేవారికి ఊపిరితిత్తుల పుట్టకురుపు అంత తొందరగా రాదని తెలుస్తోంది. చుట్టతాగేవారిలో పుట్టకురుపు సంభవం సంఖ్యలు అసలు పొగ తాగని వారి సంఖ్యలతో సమానంగా ఉన్నాయి. అంటే పొగ లోపలికి పీల్చటంవల్లనే ఊపిరి తిత్తుల కాన్సర్ వచ్చే అవకాశం ఉంటుందన్న మాట. సిగరెట్లు కాల్చే వారిలో పొగ లోపలికి పీల్చేవారికీ, పీల్చనివారికీ మధ్య తేడాలను గురించి పరిశోధనలు జరిపే ప్రయత్నాలు జరుగుతున్నాయికాని, కాల్చేవారే సిగరెట్ పొగ లోపలికి తీసుకున్నదీ లేనిదీ సరిగ్గా చెప్పలేక పోతున్నారుట.)

ఈ పరిశోధనలవల్ల బయటపడిన మరికొన్ని విశేషాలు:—రోజుకి సుమారు సమానమయిన సిగరెట్ల సంఖ్య కాల్చేవారి మరణ వివరాలు పరిశీలించగా, అమెరికాలోకన్నా, బ్రిటన్‌లో చావులు అధికం అని తెలిసింది. దీనికి రెండు కారణాలు ఉండవచ్చు. ఒకటి అమెరికాలోకన్నా, బ్రిటన్‌లో సిగరెట్ల వ్యసనం కొన్ని సంవత్సరాలు ముందుగా ప్రారంభం అయింది. రెండు, అమెరికాలో బ్రిటన్‌లో కాల్చినంతవరకూ సిగరెట్‌ని కాల్చరు—[illegible]



అమ్మాయిపేరు కారోన్‌గార్డ్‌నర్. చుట్టపేరు తెలియదుకాని, 'సిగరెట్లకన్నా చుట్టలే మంచివి' అని ఈ లండన్ నటి హామీ!

# 'ధూమపానం'

న్యూఢిల్లీ వల్లభభాయిపటేల్ ఇన్‌స్టిట్యూట్ వారు ఇటీవల జరిపిన పరిశోధనలవల్ల భారత దేశంలో ఊపిరితిత్తుల పుట్టకురుపువ్యాధి అధికం అవుతున్నదని తెలుస్తోంది. ఇది ముఖ్యంగా 40 సంవత్సరాల పైన వయస్సు కలవారికీ, అందు లోనూ 50-60 ఏళ్ల మధ్య వారికీ అధికంగా వస్తోందిట. 1950 నుంచి 1959 వరకూ 'లంగ్ కాన్సర్' కల వారి సంఖ్య రెండు రెట్లకు పైగా అధికం అయింది. సిగరెట్ పొగ ఈ వ్యాధికి ముఖ్య కారణాలలో ఒకటి అని ఈ పరిశోధన కేంద్రంవారు చెబుతున్నారు.

గానే పారేస్తారు. మిగిలిపోయిన సగం పొగ తీవ్రత తగ్గిస్తుందేమో!

సిగరెట్ పొగలో చర్మానికి తగిలితే కాన్సర్ కలిగించే పదార్థాలు కొన్ని ఉంటాయి. ఇది పరిశోధనలవల్ల తెలిసింది. కాని, ఇవి కావల్సినంత మొత్తాలలో ఉండవు. మరి కాన్సర్ ఎలా వస్తుందని కొందరు అడుగుతారు. కో—కార్సినోజెన్‌లు అనే పదార్థాలు ఉన్నాయి. వీటివల్ల పుట్టకురుపు పుట్టించే పదార్థాల శక్తి కొన్ని రెట్లు అధికం అవుతుంది. సిగరెట్ పొగలో ఈ కో—కార్సినోజెన్‌లు కావలిసినన్ని ఉంటాయి!

సిగరెట్ పొగ జంతువుల వూపిరి తిత్తులలోకి ఎక్కించినా కాన్సర్ రాలేదని కొందరు వాదించవచ్చు. కాని, కనీసం 20 సంవత్సరాలయినా పొగ తాగితేకాని, వ్యాధి పొడసూపదని ఇతర పరిశోధనలు సూచిస్తున్నాయి.

సిగరెట్ల అలవాటుకీ, కాన్సర్‌కీ సంబంధం అనుకున్నంతగా లేదని వాదించేవారు ఇంకా ఇలా అంటారు 1. ఎలాగూ కాన్సర్ వచ్చేవారు సిగరెట్లు కాల్చటంవల్ల వూపిరి తిత్తుల పుట్టకురుపుకి లోనవుతున్నారు. శరీరంలో మరొక భాగంలో వచ్చేబదులు ఇక్కడ వస్తుంది, అంతే. 2. కొంతవరకు ధూమపానం చెయ్యాలనే కోరిక వంశపారంపర్యంగా వస్తుంది. కాన్సర్ కూడా అంతే. అందుచేత రెండూ పూర్వీకులనుంచి సంక్రమిస్తాయి. 3. సిగరెట్లు కాల్చే వారిలో కాన్సర్ వచ్చి మరణించే వారి వూపిరితిత్తులు బలహీనమయినవి. మునుపు వీరు క్షయవచ్చి పోయేవారు. ఇప్పటి మందులవల్ల క్షయ తగ్గి పుట్టకురుపు మూలంగా చావులు అధికం అయ్యాయి

పరిశోధనలవల్ల పై వాదాలన్నీ నమ్మతగినవి కావని తెలిసింది.

ఈ పరిశోధనలవల్ల తేలిన దేమిటంటే:

1. సిగరెట్లు కాల్చే వారందరికీ వూపిరితిత్తుల పుట్టకురుపు రాదు.

2. రోజుకి 25 సిగరెట్లు తాగే వ్యక్తులలో ప్రతి పద్నాలుగురికీ ఒకరు తన డెబ్బయి అయిదవ సంవత్సరం లోపుగా కాన్సర్‌వచ్చి చచ్చిపోవచ్చు. తక్కువ కాల్చేవారికి ఇంకా తక్కువ ప్రమాదం

3. కేవలం సిగరెట్లు కాల్చడంవల్లనే వూపిరితిత్తుల కాన్సర్ వస్తుందనుకొనటం పొరపాటు. ఆధునిక వాతావరణంలో—అందులో పెద్ద నగరాలలో— అన్ని రకాల (ప్రత్యేకంగా పారిశ్రామిక) ధూమములూ ఎక్కువ అవుతున్నాయి. సిగరెట్ పొగతో కలిపి వూపిరితిత్తులను మరింత కాన్సర్‌కు గురి అయ్యేట్లు చేస్తాయి.

సిగరెట్ల పొగలో ఆమ్ల పదార్థాలు ఎక్కువ. చుట్ట, పైప్‌ల పొగలో క్షార పదార్థాలు అధికం. లోపలికి పీల్చక పోవటమేకాక, గుణంలో కూడా భేదం ఉండటంచేత ఇవి కాల్చేవారికి కాన్సర్ అంత శీఘ్రంగా రాదేమో!

## పొగ తాగటంవల్ల కలిగే ఇతర శారీరిక వ్యాధులు

ధూమపానం చేసేవారిలో క్రానిక్ బ్రాంకయిటిస్, పల్మనరీ ట్యూబర్ క్లోసిస్, థ్రోంబో ఏంజయిటిస్ అబ్లిటరాన్స్ (రక్తస్రావం చెడిపోవటం, ప్రత్యేకంగా కాళ్లలో), మూత్రకోశం పుట్టకురుపు (పరిశోధనలు జరుగుతున్నాయి) కడుపులో అత్యామ్ల పరిస్థితి ఎక్కువగా ఉంటాయి.

కాని, పొగ తాగడంవల్ల హృద్రోగాలు ఎక్కువ అవుతాయన్న వూహ నిరాధారం అనిపిస్తుంది. అలాగే కడుపులో పుళ్ళు (అల్సర్‌లు) సిగరెట్లవల్ల రావని చెప్పవచ్చు. సిగరెట్లు కాల్చడంవల్ల 'దమ్ము' తగ్గుతుందని కొందరు ఆటగాళ్ళు అంటారు కాని, ఇది నిజం కాదని తోస్తుంది.

మరికొన్ని వివరాలు: కడుపుతోవున్నప్పుడు సిగరెట్లు కాల్చే స్త్రీలకు పుట్టే బిడ్డల బరువులు కాల్చని వారికి కలిగే శిశువుల బరువులకన్నా తక్కువగా ఉంటాయి. కొన్ని సందర్భాలలో తండ్రుల ధూమపాన వ్యసనాలమీద కూడా వారికి పుట్టిన బిడ్డల బరువులలో భేదాలు కనిపించాయి. బాగా ధూమపానం చేసే వారిలో ఉత్సాహం, శక్తి ఎక్కువగా ఉంటాయి. ఎక్కువగా సిగరెట్లు కాల్చేవారు ఉద్యోగాలు, ఇళ్ళు కూడా కాల్చనివారికంటే ఎక్కువగా మారుస్తారుట. మరీ అధికంగా పొగ తాగేవారికి 'నికోటిన్' ఇంజక్షన్‌లు ఇస్తే వ్యసనం కొంచెం తగ్గుతుంది. పొగ తాగే అలవాటు మానుకొనడం అంత కష్టంకాదు. కొంతకాలం పొగతాగి మానేస్తే దేహం బరువు అధికం అవుతుంది.

## అయితే ఏంచెయ్యాలి?

పొగ తాగటం మానెయ్యటం అన్నిటికన్నా ఉత్తమం! ఇది వీలుకాకపోతే, మంచి 'ఫిల్టర్'లు ఎలా ఉండాలని కనిపెట్టి సిగరెట్లకు తగిలించటం మంచిది. ఈ విషయమై ఇంకా చాలా పరిశోధన జరగవలసి ఉంది. కనుక మరొక సూచన ఏమిటంటే—సిగరెట్లను సగంపైగా కాల్చక పోవటం. ఈ పద్ధతి రెండు విధాల మంచిదేమో! సిగరెట్లు కాల్చేవారికీ ఇబ్బంది తక్కువ, అవి తయారు చేసే వారి అమ్మకాలూ అధికం అవుతాయి......

ఇంతేకాక, సిగరెట్లమీద పన్నులు ఎక్కువచేసి, చుట్ట పైప్‌లు పొగాకులమీద పన్ను తగ్గించవచ్చు.

['లంగ్ కాన్సర్' వచ్చిన వెంటనే కనిపెట్టటం. సాధారణంగా కష్టం—దీనికి అశ్రద్ధ ముఖ్య కారణం. కనిపెట్టిన తర్వాత 'పేషంటు' ఒక సంవత్సరంకన్నా ఎక్కువ బ్రతకటం అరుదు.]

—56 వ పేజీ చూడండి

### ఇవీ – అవీ

పొగాకు అమెరికానుంచి యూరప్ ద్వారా తక్కిన దేశాలకి పాకింది. 1492 లో 'బహమాస్'కి వెళ్ళిన కొలంబస్ ఇలా వ్రాశాడు:

'సంతామరియా నుంచి ఫర్నాందినాకి ఒంటరిగా పడవలో వెడుతున్న మనిషి ఒకతనిని చూశాను. అతనివద్ద కొన్ని ఎండిపోయిన ఆకులు ఉన్నాయి. ఇవంటే ఇక్కడి వారికి చాలా ఇష్టం అనిపిస్తుంది. నేనుసాన్‌సాల్వదార్‌లో ఉన్నప్పుడే కొంత ఆకు కానుకగా ఇచ్చారు'

అప్పటినుంచీ పొగ తాగటం ఒక 'మర్యాద'గా పరిగణించే వారన్నమాట!

1499లో అమెరిగో వెస్పుచ్చి వెనెజుయెలాకి వెళ్ళినప్పుడు 'ఇక్కడివారు బుగ్గనిండా ఏదో పచ్చని మూలిక లుంచుకుంటారు. జంతువులు నమిలినట్లు దీనిని నములుతూ ఉంటారేమో' అసలు మాట కూడా సరిగా పలకలేరు' అని వ్రాశాడు.

అమెరికన్ ఇండియన్లు ఒక Y ఆకారంలో ఉన్న గొట్టం రెండు మొనలనీ ముక్కు ద్వారాలలో దూర్చి దానిగుండా మరీ పొగని పీల్చేవారు! ఈ గొట్టాన్ని వారి 'భాషలో 'టబాకో' అనేవారు. టొబాకో అనే మాట ఉద్భవం ఇదన్నమాట.

చుట్ట కాల్చే అలవాటు ఎక్కువగా క్యూబాలో ఉండేదిట అప్పట్లో!

యూరప్‌కి మొదట పొగాకు మొక్క తీసుకు వచ్చిన వ్యక్తి ఒక డాక్టర్ ఇతనిపేరు ఫ్రాన్సిస్కో హర్నాండస్. పొగాకు విత్తనాలు ఫ్రెంచిరాణిగారికి పంపిన జాన్ నికో మూలంగా ఈ మొక్కకి 'నికోటిన్' అనే పేరు వచ్చింది.

పదహారవ శతాబ్ద చివరనుంచి ధూమపానం యూరప్ అంతటా పాకిపోయింది. ఇది ఆరోగ్యానికి చాలా మంచిదని అప్పటి వైద్యులు నమ్మేవారుట! 1664—66 లో ఇంగ్లండ్‌లో వచ్చిన ప్లేగ్ సమయంలో పొగాకుతో ఈ వ్యాధిని అరికట్టవచ్చునను కున్నారుట.

పొగ ఎనిమాలు సయితం ఇచ్చేవారు!

ధూమపానం మరీ అధికం అవటం అప్పటికే కొందరికి ఆందోళన కలిగించింది. చివరకి 1604 జేమ్స్—1 స్వయంగా ధూమపానాన్ని ఖండిస్తూ, ఒక పుస్తకం రాశాడు. అయితే ఇంగ్లాండ్‌లో రష్యాలో వలె పొగ తాగిన వారిని చట్ట రీత్యాశిక్షించలేదు.

1634 లో రష్యాలో అమలులోకి వచ్చిన చట్టం ప్రకారం అమ్మినవారికీ, కాల్చినవారికీ ముక్కు కోశేవారు. అప్పటికీ మాట వినకపోతే మరణశిక్ష లేక సైబీరియాకి బహిష్కరణ!

ఒకప్పుడు పోప్ ఉర్బన్ VII కూడా పాపల్ బుల్ ఒకటి జారీచేస్తానని భయపెట్టాడుట—ధూమపానం పాపం అని.

బెర్న్ (స్విట్జర్‌లాండ్) లో ఒకప్పుడు ధూమపానం రంకుతో సమానమయిన నేరం కింద జమ కట్టారు.

సిగరెట్లు 19 వ శతాబ్దంలోనే ప్రచారానికి వచ్చాయి. యూరప్‌కన్నా ఇండియా, మెక్సికో, సయాంలలో ఏదో ఒక రకమయిన సిగరెట్లు వాడుకలో ఉండేవని తెలుస్తుంది! ముఖ్యంగా 1854—6 లో జరిగిన క్రిమియన్ యుద్ధం ద్వారా సిగరెట్లు బ్రిటన్‌కి ప్రాకాయుట. ఈ శతాబ్దం ప్రారంభంలో ఆడవారు సిగరెట్లు కాలిస్తే, యూరప్‌లో కూడా తప్పు అనుకునేవారు. స్త్రీలు పొగ తాగటం విషయమై కొన్ని నాటకాలు సయితం రాశారుట.........

29—4—62 నుంచి ఇటలీలో ధూమపానానికి సంబంధించిన ప్రకటన ఏదీ అసలు వెయ్యరాదనే చట్టం అమలులోకి వచ్చింది......



జపాన్ వెళ్లినప్పుడు, రోమ్‌లో రోమన్‌లాగే చెయ్యిఅన్నారుగా!

# తెరమీద తెరవెనుక

పీరా

హాస్యంగా అందులోనూ కొంత ఉదాత్తంగా, ఒక్కొసారి అద్భుతంగా నటిస్తుంది రాజసులోచన. మళ్ళీ కన్నీరొలికించే ఇల్లాలుగా ఉత్తమస్త్రీగా రాణిస్తుంది. నృత్యంచేస్తూ రంభ; తిలోత్తమలాంటి దేవకన్యల వేషాలూ వేస్తుంది; అదే అమ్మాయి వాంప్ రోల్సులో మరీ శేషుగ్గా రాణిస్తుంది. "హీరో ప్రక్కన హీరోయిన్‌గా, హీరోయిన్ ప్రక్కన హీరోయన్‌గాను [సపోర్టింగ్ రోల్‌లో] కూడా ఆమెది అందెవేసిన చేయి.

అంచేతనే రాజసులోచన మరోసారి తెరమీదా, రంగస్థలంమీదా ఇప్పుడు రాణిస్తున్నట్లే రాణించగలదని అనుకున్నా తప్పులేదు. ఐతే ఆమెకు మెత్తని పాత్రలే యిష్టం భరతనాట్యం అంటే మరీ యిష్టం.

## మెత్తని పాత్రలంటే ఇష్టం

"నాకు సాఫ్ట్ రోల్స్ అంటే యిష్టం" అంటుంది రాజసులోచన. హాస్యం చేసింది; నృత్యం చేసింది; తెరమీద రకరకాలుగా రాణించింది.

ఆదిన యామె నృత్య ప్రదర్శన లిద్దామనే క్లాస్సు చేర్చుకుంది. డిప్లొమా పుచ్చుకుంది.

తల్లి దండ్రీ అమ్మాయికి సినిమాల్లో చాన్సు వస్తుందీ అంటే మొదట్లో ఒప్పుకోనేలేదు. కాని ఆమె తొలిసారి గుబ్బి కర్ణాటక ప్రొడక్షన్స్‌వారి చిత్రంలో అగుపించింది. ఆటుతర్వాత ప్రకాశరావు గారి "కన్నతల్లి" చిత్రంలో కూడా అగుపించింది.

శ్రీమతి రాజసులోచన 'అంతా మనవాళ్ళే' లో కూడా ప్రజల నాకర్షించింది.

ఈమె చాలా చక్కగా నటించి నృత్యాలు చేసి తన్న హాస్య పాత్రలను జనామోదంగా పోషించి ప్రజలు మెచ్చిన తార ఐన తర్వాత యీనాళ గర్వంగా పేర్కొనతగ్గ చిత్రాలు 'పెళ్ళినాటి ప్రమాణాలు', 'మంచి మనసుకు మంచి రోజులు', 'శాంతినివాసం', 'మాంగల్యబలం', 'ఋష్యశృంగ', 'బండరాముడు' చిట్టితమ్ముడు మొదలైనవి.

అందరు తెనుగుతారలు అన్యభాషా చిత్రాలకు అంతో యింతో తమ టాలెంట్‌ను యిస్తున్నప్పుడే శ్రీమతి రాజసులోచన కూడా కన్నడ, తమిళ, హిందీ చిత్రాలలో నటించింది. తొంభై పైచిలుకు ఉంటాయామె చిత్రాలు.

"శభాష్ రాజా", "టైగర్ రాముడు", 'వాల్మీకి' చిత్రాలామెకు ప్రత్యేకంగా ఒక స్థాయి నిచ్చాయి.

రాజసులోచన సాధారణంగా చాలా సున్నితమైన మనసు గలది. ఎవరేనా ఏమేనా అంటే బాధపడుతుంది. నొచ్చుకునే తత్వమే అయినా వెంటనే 'సరే సరే' అనే యదు. డైరెక్టర్‌లు, ప్రొడ్యూసర్‌లు ఎవరేనా సలహాలు, ఆదేశాలు యిస్తే అలాగ తనకు నచ్చకపోయినా 'డ్యూటీ' గా ఫీలై చేస్తుంది.

## సున్నితం సుకుమారం

భరతనాట్యం, కథక్కళీ, పాశ్చాత్య నృత్యాలూ యిత్యాదులు అన్నీ కలగాపులగం చేసే మిశ్ర నృత్యాలు ఆమెకు గిట్టవు—గాని ఒక్కొసారి సినీమాలలో యిలా చేసింది. అప్పుడు లోపల లోపల బాధపడేది. ఒకసారి 'లలితాంగి' అనే చిత్రం షూటింగ్ సమయంలోనే కాబోలు సెట్‌మీద వారికి అభ్యంతరం చెప్పవల్సిన సందర్భంలో కూడా కిమ్మనకుండా వృత్తిధర్మంగా నటించి వచ్చేసి, కారులోకి వస్తూనే కన్నీళ్ళు నింపుకుని ఏడ్చేసిందట.

మాంగల్యం చిత్రం ఆమె కొక మలుపు అయితే మంచి మనసులకు మంచి రోజులు అగ్రస్థాయికి తెచ్చిన చిత్రం.

## హాబీలు సర్దాలు

"నాకు గల హాబీలు అంటే ఎలా చెప్పను చెప్పండి. నా వృత్తియే కళాసేవ కదా .... నేను డాన్సర్‌ను. అంచాత కళాసేవ, కళాభివృద్ధి ఇవే నా ధ్యేయాలు. అవే నాకు హాబీలు" అంటుందామె వినయంగా తల దించుకుని.

తాను కెరీర్‌ను కాపాడుకోవాలి .... డ్యాన్సర్‌గా పబ్లిక్ లైఫ్ సంపాయించాలి. తెరమీద బాగా పాత్రోచితమైన నటన చూపాలి, రంగస్థలంమీద—ట్రూపుతో మాంచి నృత్య ప్రదర్శనలనివ్వాలి.

వాస్తవానికి ఆమె 1960 లో కాబోలు జపాన్, సైగోన్ పర్యటనలు చేసింది. అప్పుడు ట్రూపుతో వెళ్లలేదు గాని, టోక్యోలో ఆమెకు మధురాను భూతులు కలిగాయి. ఎన్నో మరువురాని సంఘటనలు జరిగాయి. యుద్ధానంతరం సైగోన్ వెళ్ళిన తొలి



కొడుకులు కోడళ్లతో

భారత తార కావడంతో, ఆమెకు అక్కడ ... చాలా ఎక్కువగా స్వాగతం చెప్పారు.

తిరుగుదలలో ఆమకోకండా శ్రీమతి దు... బాయి దేశ్‌ముఖ్ సాయంతో కొన్ని ... ప్రదర్శనలు కూడా యిచ్చింది.

## జపాన్ టూర్

అప్పటినుంచి ఆమెకు జపాన్, ట్రూపుతో ... పర్యటించి రావాలనుంది. శ్రీమతి రాజసులో... చాలా అమాయకంగా నలుగురిలో కలిసిమె... తిరిగే నైజం గల అమ్మాయి గనుక విదేశ ప... నలో ఆమెకు మంచి స్నేహితులు, అభిమాన... లభ్యమయ్యారు.

శ్రీమతి రాజసులోచన, హాస్యరస భూయి... మైన పాత్రలూ వేసింది. లాస్యభరితమై... రోల్సూ నిభాయించింది. సానుభూతిని పొం... కునే "సాఫ్ట్" రోల్సు లోనూ రాణించింది. ...

"నాకు ఒక తరహా పాత్రలనే కావాలి" అని ... నాకు ప్రధాన భూమికలే యివ్వండి అని ... మొరాయించలేదు. 'నటి అన్న తర్వాత నటించగల... అందుకు రకరకాల పాత్రలు, చక్కని అవకాశ... అంటుందామె.

"అయితే ఆమెకు జనం 'వాంప్‌రోల్సు'



సి ఎస్ రావు

కన్నా 'సాఫ్ట్' రోల్సు (మెత్తని పాత్రలలో) బాగా ఇష్టపడుతున్నారని ఆమె నమ్మకం

అందుకే సాధ్యమైనంతవరకూ పాత్ర మంచి దవునా, కాదా ? కథ ఎలాంటిది అని కాస్త చూస్తే తెలుసుకుని తీరాలి అనే పట్టుదల నామె సాధ్యమైనంతవరకు చూపిస్తున్నది

'ఖైదీ కన్నయ్య", మాంగల్యబలం' లోని పాత్రలలో ఒక రకమైన జనాకర్షణ ఉన్నది అందుకేమో 'సెక్స్ అప్పీలు' తోడైంది

శ్రీమతి రాజసులోచన ఏ వి యమ్ వారి 'చోరీ చోరీ' లో హాస్యనటుడు భగవాన్ ప్రక్కన నటించింది దరిమిలాన రేలంగి ప్రక్కన కూడా బహు చక్కని హాస్యాన్ని ఆమె అందించింది 'సిఘారోంసే ఆగే' అనే మరో హిందీ చిత్రం ఆమెకు 'అఖిల భారత నటి' గా పేరు తెచ్చింది

ఆమె 'శభాష్ రాజా' చిత్రం ఢంకా బజాయించింది కాని, ఆమెకు మంచి మనసుకు మంచి రోజులు జానకి పాత్ర అంటే ఇష్టం.

శ్రీమతి రాజసులోచన రంగూన్‌లో స్టూడియోను చూసి వచ్చింది అక్కడి చిత్రరంగం, దాని తీరూ కొంతలో కొంత కుతూహలంగా వేర్పుకుంది

## హిచ్‌కాక్‌తో పరిచయం

జపాన్ టూర్ సందర్భంలోనే ఆమె 'ప్రఖ్యాత హిచ్‌కాక్' ను కల్సుకుంది 'అదో అపురూపమైన అనుభవం ' హిచ్‌కాక్‌గారు కుశలప్రశ్నలూ అవీ వేసి "మీ సూర్యకుమారి ఎక్కడ ఉంది?" అని అడిగారట

ఆమెకు ప్రత్యేకించి 'డ్యాన్సు : అభ్యాసం' ఉన్నది గనుక—అదే "ఒక ఎక్సర్‌సైజు" — పైగా ఈ నృత్య కళాసేవవల్ల మరో కోర్కె, అలా తీరని కోర్కెగానే ఉండిపోయింది. 'వీణ వాయించాలని భలే

## తెరమీద-తెరవెనుక

సరదా' కాని, ఏం లాభం?—దానికి తీరిక చిక్కడమే లేదు. ఏమైనా తీరిక దొరికితే డిటెక్టివ్ పుస్తకాలు చదువుతుంది (డిటెక్టివ్ రచయితలకు శుభవార్త) "అదొక కాలక్షేపం"—అంటుం దామె

సాధారణంగా ఆమె ఫంక్షన్స్‌కు, షాపింగ్ వస్తున్నప్పుడు మంచి ముస్తాబై వస్తుంది నగలు నిండుగా ధరిస్తుంది కాని, ఇంట మాత్రం చాలా సాదాగా ఉన్నది—

"ఔను—చీరె జాకెట్ మొదలు, నగలూ, బ్యాగ్ దాకా అన్నీ ఒకదాని కొకటి మ్యాచ్ అయిందా లేదాని చూసుకుంటుంది

ఈ నాట్యతారకు ఇల్లు కట్టించుకోడంలోనూ కారు ఇష్టమైనదెన్నుకోడంలోనూ మహా సరదా ఉన్నది

ఆ రెండూ ఆమెకున్నాయి. ఇప్పుడు భర్త సి ఎస్ రావుతో వేరే కాపురంగా మరోయింటి మారి, తాను ఉంటున్న ఇంటిని అద్దెకు ఇద్దామనుకుంటున్నదిట

ఈమెకు నాట్యతారగా ఉజ్వలభవిష్యత్తు గృహిణిగా శాంతి సుఖాలను, ఆకాంక్షిస్తున్నాము



'ఓహో! రండి! రండి!!' అతిథుల నాహ్వానిస్తోన్న సులోచన.



ఎండలా?
ఆ పేరు
ఎప్పుడూ
వినలేదే!



విజయ్ ఫ్యాన్‌కు
అలవాటు పడ్డారంటే
మీరూ అ ముక్కే అంటారు

# విజయ్

16" ఎ/సి ఆసిలేటింగ్
టేబిల్ ఫ్యాన్ - పెడెస్టల్ ఫ్యాన్
మూడ చక్కనిది
మువ్వనైన రంగులు।
సేఫ్టీ వైర్ మెష్
పుష్ బటన్ కంట్రోల్
దక్షిణ ఇండియాకు డిస్ట్రిబ్యూటర్లు,
ఓబుల్‌రెడ్డి ఏజన్సీస్
మద్రాసు-2

EP OBA. 10

# అపార్థం

23—పేజీ తరువాయి

నేవో కొన్ని సిద్ధాంతాలుండేవి. అవి ఆచరణలో పెట్టటంకోసం ప్రయత్నిస్తూ ఉండేవాడు.

'జీవితంలో నువ్వు కోరేదీ, వాంఛించేది ఏమిటి బావా ?' అని అడిగాను ఒకసారి.

'మంచి ఉద్యోగం, నన్ను ప్రేమించి, సుఖ పెట్టగల భార్య, చక్కని పిల్లలు ఉంటే చాలు రాధా! నాకు పెద్ద ఆశలు, ఆశయాలు లేవు. అది గొప్పతన మవునో కాదో కూడా నాకు తెలియదు. నేను సుఖపడాలి; నా వాళ్ళని సుఖపెట్టాలి. నా వల్ల ఎవరూ అనవసరంగా బాధపడకుండా ఉంటే చాలు. నలుగురితో మంచిగా పోతే నాకు తృప్తి.' అన్నాడు.

'మంచి ఉద్యోగం అంటే ?' అన్నాను.

'నన్ను, నా కుటుంబాన్ని పోషించుకునేందుకు, కొద్దిగా దాచుకునేందుకు సరిపోయే రాబడి గలది నాకు ఇంజనీరింగ్ అంటే చాలా ఇష్టం అని నీకు తెలుసుకదా. నేను చదువుతున్నదీ ఇంజనీరింగే కనుక నాకు అభిరుచిఉన్న ఉద్యోగమే వస్తుందిలే' అన్నాడు.

'మరి నీ భార్య ఎటువంటిదయి ఉండాలి ? చక్కనిది, చదువుకున్నది, డబ్బున్నది కావాలా ?' అని అడిగాను.

'లేదు రాధా! అవేవీ అత్యవసరంకాదు. ఉంటే సంతోషమే ననుకో; కాని, లేకపోయినా ఫరవాలేదు. కొద్దిగా చదువుకున్నా చాలు అందమైనది కాక పోయినా, ఫరవాలేదు నాకు కావలసిందల్లా ఆ అమ్మాయి నెమ్మదయినదై ఉండాలి. అలాగని మన్నుతిన్న పాముకాదు సుమా. చురుగ్గాఉన్నా, వినయం ఉండాలి. గర్వంఉండరాదు. నన్ను మనస్ఫూర్తిగా ప్రేమించాలి. చక్కగా పాట పాడాలి అన్నట్టు' అన్నాడు నన్ను చూసి నవ్వుతూ.

అది నన్ను ఉద్దేశించి అన్నాడో లేదో నాకు తెలియదు. నేను ఏదో పాడతాను గాని, చక్కగా పాడతా ననడానికి వీల్లేదు. పోతే, నన్నే వర్ణించాడనుకో డానికి ఆస్కారంఉంది; లేదు.... నేను చదువు కుంటున్నా. ఇంకా చదువుతాననికూడా తెలుసు. అయినా చదవకపోయినా ఫరవాలేదు అన్నాడు. నేను చాలాకీగా ఉంటాను. నెమ్మదిగా ఉండాలి అన్నాడు. మళ్ళీ అలాగని మన్నుదిన్నపాము కాకూడ దట దాన్నిబట్టి నాకు అర్థమయిందేమిటంటే తనకి నేనంటే అప్పటికి ప్రత్యేకమయిన అభి ప్రాయం లేదు. చేసుకోమంటే చేసుకుంటాడు బాగా చూసుకుంటాడు. కాని, నన్నే చేసుకోవాలన్న పట్టింపు మాత్రం లేదు. నాకు మాత్రం అతనంటే ఎందుకో చాలా ఇష్టం, ప్రేమ కల్గాయి. ఈ విష యాలు చెప్పిన తరువాత మరీ. "నన్ను ప్రేమించి సుఖపెట్టగల భార్య" అని పదేపదే అనుకోసాగాను "నిన్ను ప్రేమిస్తున్నాను బావా, సుఖపెడతాను కూడా" అని బావతో చెప్పలేక, బావ ఫోటోతో చెప్పేదాన్ని. మా వివాహ ప్రసక్తి ఏమీ రాకముందే బావ అమెరికా వెళ్లిపోయాడు. ఊరికే స్నేహి తులుగా మాత్రం వీడ్కోలు చెప్పుకున్నాం ఉత్త రాలు రాయి రాధా అని చెప్పాడు.' 'అలాగే బావా' అన్నాను.

తను చెప్పినట్లే ఆనర్సులో చేరాను. బావ కోసం ఆనర్సు చదవాలి. మంచి మార్కులతో పాసవ్వాలి అని పట్టుబట్టి చదివాను మొదటి సంవత్సరమంతా. బావ దగ్గరనుండి ఉత్తరాలకోసం ఎదురుచూస్తూ ఉండేదాన్ని. అక్కడి విషయాలు వ్రాసేవాడు. నే నడిగిన ప్రశ్నలకి సమాధానా లిచ్చేవాడు. ఎంతో ప్రేమగా వ్రాసేవాడు.

ఒకసారి తన స్నేహితుడి గురించి వ్రాస్తూ "తను ప్రేమించిన అమ్మాయి మరో వ్యక్తిని పెళ్లి చేసుకున్నదని ఆత్మహత్య చేసుకున్నాడు రాధా! అంతా ఎంత గొప్ప ప్రేమ అన్నారు. కాని, నేను హర్షించలేకపోయాను. బాధపడ్డాను వాడికోసం. కాని, చచ్చి సాధించే దేముంది? అనిపించింది జీవితాన్ని అంత తేలికగా అంతం చేసుకోవటానికి వాడికి హక్కు లేదనిపించింది. నిజమే! ప్రేమించిన స్త్రీ వద్దంటే, కష్టంగానే ఉంటుంది. కాని, గుండె దిటవు చేసుకోవాలి మానవుడు ఆశాజీవిగా ఉండా లని నా నమ్మకం. అదే నేనయితే ఆమెను మర్చి పోలేకపోయినా, ఆమెకోసం నా జీవితం నాశనం చేసుకోను. నన్ను ప్రేమించిన వ్యక్తికోసం నే నెందుకు బాధపడాలి. మరొకమ్మాయిని, నాకు నచ్చిన మనిషిని కల్సుకుంటే వివాహం చేసుకుంటాను కూడా. మొదట ప్రేమించిన వ్యక్తిని నేను మరిచి పోలేనేమో గాని, క్షమించలేను. అది ఉన్నతమైన ప్రేమకాదనీ మీ రనవచ్చు. కాని, నాకు మాత్రం రేపుమీద ఆశ ఎక్కువ. నిన్నను మర్చిపోయి, రేపు కోసం జీవించటమే మంచిదని నా నమ్మకం" అని వ్రాశాడు నాకు ఆశ్చర్యంవేసింది. ప్రేమించిన వ్యక్తి కాదంటే, విచారించడట! కాని ఆలోచిస్తే అదే ఒప్పేమో అనిపించింది కాని, ఆ సిద్ధాంతంతో ఎందుకనో ఏకీభవించలేకపోయాను. నా విషయమే తీసికొంటే, 'బావ కాదం'టే మరొకర్ని చేసుకో గలనా ? అది కలలో మాట. చేసుకుంటే బావనే చేసుకోవాలి; లేకపోతే ఇలాగే ఉండిపోవాలి అని నిశ్చయించుకున్నాను ఇది మొదటి ఆనర్సులో ఆ వేసంగులకి మా చిన్నాన్నగారి ఊరు వెళ్లాను అదే నా జీవితాన్ని మార్చేసింది రమా! అలా ఎందుకు చెయ్యాలనిపించిందో నాకే తెలియదు.

చిన్నాన్న కూతురు లీల అంటే, నాకు చాలా ఇష్టం. అదికూడా అక్కా, అక్కా అంటూ నాతో చాలా చనువుగా ఉంటుంది. నాకన్నా కొన్ని నెలలే చిన్నది నాకూ, దానికీ పోలికలుంటాయి చక్కని పిల్ల. చిన్నాన్నకి అట్టే డబ్బులేదు. తన వంతు వచ్చిన వాటా ఏదో వ్యాపారంలో పోగొట్టుకున్నాడు. నాన్న సాయం చేస్తానంటే అభిమానం అడ్డు వచ్చి, వద్దుగాక వద్దు అన్నాడు. ఏదో చిన్న ఉద్యోగంతో, చాలీ చాలని జీతంతో కాలం గడుపుతున్నాడు పిల్లల్ని అట్టే పట్టించుకోడు మా పిన్ని వ్యాపారం పోయాక, ఆ దిగులుతో పోయింది. మా లీలే ఇంటికి అడదక్షత అయింది. మిగతా వాళ్లంతా దానికన్నా చిన్నవాళ్ళే. అది 4 వ ఫారం చదువుతూ ఉంటే, వాళ్ల అమ్మ పోవటంవల్ల చదువు ఆగిపోంది పాట అంటే ఎంతో ఇష్టం. వాళ్ళ ఇంటిప్రక్క జడ్జిగారి అమ్మాయి వీణ నేర్చుకుంటూ ఉంటే, వెళ్లి వినేది దాని కంఠం, ఉత్సాహం చూసి ఆ మేష్టారే ఏమీ డబ్బు తీసుకోకుండా వీణ నేర్పారు. ఆయన దగ్గర నేర్చుకుంది. వీణ చక్కగా వాయిస్తుందని నాన్న ఒక వీణ కొని ఇచ్చారు. గాత్రం

**కూడా బాగా పాడుతుంది. దానికున్నదల్లా ఆ పాట, అందం అంతే.** చిన్నప్పుడే బాధ్యతలు మెత్తిన పడ్డాయేమో, మానసికంగా చాలా ఎదిగింది. ఒకర్ని సుఖపెట్టడం బాగా తెలుసు ఎదుటివారి మన సెరిగి ప్రవర్తించేది. పనిపాట్లు బాగా చురుగ్గా చేసేది. అదంటే నాకు జాలి, ప్రేమ, అభిమానం అన్నీ. నే నొక్కర్తినే ఆడపిల్లను కావటంవల్ల అది నాకు స్వంత చెల్లెలే అనిపించేది. అది సుఖంగా ఉండాలనీ, చిన్నప్పుడే కష్టాలు పడడంవల్ల, తర్వాత నైనా సుఖపడాలని కోరుకునేదాన్ని. బావకూడా నా లాగే అనేవాడు. లీలకి కూడా తను బావేగా. అందుకని తను కూడా బావతో చనువుగానే ఉండేది. బావకి లీల—పాట అంటే చాలా ఇష్టం ఈ సంగతి నాకు బాగా తెలుసు.

సెలవుల్లో వాళ్ళ ఊరెళ్ళినప్పుడు లీలతో ఏదో మాట్లాడుతూ ఉంటే, బావ సంగతి వచ్చింది బావ నాకు ఉత్తరాలు వ్రాస్తున్నాడని చెప్పాను.

'బాగా వ్రాస్తాడా అక్కా! ఏం వ్రాస్తాడు' అంటూ కుతూహలంగా అడిగింది. 'నేను రాస్తే జవాబిస్తాడా అక్కా' అంది.

'ఎందుకివ్వడు లీలా' అన్నా.

"ఏమో అక్కా. నేను చదువుకోలేదుగా అందు కని"

"అదేమన్న మాట లీలా! బావకి ఎక్కువ చదువు కున్న అమ్మాయిలంటే అసలు ఇష్టంలేదుట తెలుసా. నీ పాట అంటే ఎంతో ఇష్టంకూడా" అన్నా నవ్వుతూ.

కాని, నా మాటలు విన్న లీల—ముఖంలో వెలుగూ, సంతోషం చూసేసరికి నా కేదో అర్థమయింది. గతుక్కుమన్నాను.

నెమ్మదిగా 'నీకు బావ అంటే ఇష్టమా లీలా' అని అడిగాను

తలవంచుకుని మెల్లిగా చెప్పింది "అవునక్కా! నాకు బావ అంటే చాలా ఇష్టం. ఒక్కొక్కసారి అనిపిస్తుంది నాలో ఏమి ఉందని బావ నన్ను చేసు కుంటాడు? చదువా, డబ్బా, నలుగురిలో తిరగ్గలవా? కాని, మళ్లీ నేనే అనుకుంటా. నా పాటతో బావని మెప్పించలేనా అని. ఏమోఅక్కా! బావ చేసుకుంటే నా అంత అదృష్టవంతురాలు ఉండదు. చేసుకోకపోతే అంత దురదృష్టవంతురాలూ ఉండదు. బావైతే కట్నం లేకుండా చేసుకుంటాడు కాని, మరొకరు, మరొకరూ ఎందుకు చేసుకుంటారు? నాన్న కట్నం ఎలాగూ ఇవ్వలేరు. పోనీ, పెళ్లి మానేస్తానన్నా, నేను బ్రతికేది ఎలా? నా కాళ్లమీద నేను నిలబడ్డా నికి తగిన చదువులేదు ఇప్పుడు చదువుకునే అవకాశమూ లేదు నాన్న ఎంత త్వరగా పెళ్లి చేసి, తన బరువు వదిలించుకుందామా అని చూస్తున్నారు. మొన్న ఎవరితోనో చెప్తున్నారు: 'ఏ రెండో పెళ్లివాడికో ఇచ్చి చేసేస్తాను. అదృష్టం ఉంటే, అదే సుఖపడుతుంది, ఏ ఇంజనీరో, డాక్టరో ఎవరొస్తారు? అని నాకెలాగో ఆ రెండో పెళ్లివాడు తప్పడు' అంది.

నేలమీద ఆమె కన్నీళ్లు టపటపా పడ్డాయి.

నాకు జాలివేసింది. దాని ముఖం ఎత్తి, "ఛా, ఏడవకు లీలా! మరేం ఫరవాలేదు. మేమంతా ఉండగా, మీ చిన్నాన్న నిన్ను రెండో పెళ్లివాడికి ఎలా ఇస్తాడు?—నీ కేం భయంలేదు. ఊరుకో" అని ఓదార్చాను.

అది నన్నడిగింది; "బావ నిన్ను చేసుకుంటా డను కుంటున్నానక్కా. మరి చదువుకున్నవాళ్ళంటే ఇష్టంలేదంటున్నావే ?" అని.

"అలా ఏమీ అనుకోవడంలేదు లీలా!" అని సంభాషణ మార్చేశాను.

ఆ రాత్రిఅంతా ఆలోచించాను. లీల—మాటలే నా చెవులో రింగుమంటున్నాయి! "పెళ్లి మానేదా మంటే, ఎలా బ్రతకను? డబ్బా, చదువా?...... నా కెలాగూ రెండో పెళ్లివాడు తప్పడు." నా విష యం ఆలోచించా. నేను పెళ్లి మానేసినా ఫరవా లేదు డబ్బుంది. అది పోయినా, చదువుంది. కాలక్షేపానికైనా, మరో వ్యావర్తికోసం అయినా ఉద్యో గం చేసుకోగలను అంతగా కావలిస్తే ఎంత కట్న మయినా ఇచ్చి మరొకర్ని చేసుకోగలను నన్ను చేసుకునేందుకు ముందుకు వచ్చేవాళ్లెందరో ఉంటారు. ఇక బావ సంగతా! అతని కెలాగా నామీద ప్రత్యేకమైన ప్రేమలేదు. నేనంటే ఇష్టంఉంది. చేసుకుంటా ననుకుంటూ ఉండ వచ్చు. నన్ను, లీలను నిలబెడితే నన్నే ఎంచుకుంటాడు కూడా. ఇన్ని దినాల సహవాసం తరువాత ఆమాత్రం ధైర్యముంది. చేసుకుందామని ఉన్నట్టుకూడా ఈ మధ్య వ్రాసిన ఉత్తరాలు చెప్తున్నాయి. కాని ఇక్కడితో నేను ఆపేస్తే, లీలను చేసుకుంటాడు. లీలలో బావ కోరిన గుణాలు ఉన్నాయి. బావని ప్రేమిస్తోంది; సుఖపెడుతుంది. నేను బావను చేసు కోకపోతే, లీల సుఖపడుతుంది బావ బాధపడడు. "ప్రేమించిన అమ్మాయి కాదంటే, మరొకమ్మా యిని చేసుకుంటా" అన్నాడుగా. కాని, నన్ను క్షమించడేమో. ఎందుకు క్షమించడు? అంత కఠినాత్ముడా! కాని, బావను వదులుకోగలనా? ఇన్ని దినాలూ ప్రేమతో పెంచుకున్న ఆశలూ, మమ తలూ ఒక్కసారి త్రుంచుకోగలనా? లీల, బావతో సుఖంగా కాపురం చేస్తూంటే మనస్ఫూర్తిగా ఆనందించగలనా? అంత నిగ్రహం నాకు ఉం టుందా ? స్వార్థం కొంచెంసేపు వెనక్కి లాగితే మానవత ముందుకి నెట్టింది. నాలోని, మంచి త్యాగం చెయ్యమంటే 'వద్దు. తమ్ము మాలిన ధర్మం' అని తర్కించేసింది నాలోని చెడు. ఒకంతట నిర్ణయా నికి రాలేకపోయాను. కాని, చివరికి మంచితనమే గెల్చింది. నా మనస్సు ఎవరికీ తెలియకముందే, నేను బావకి మాట ఇవ్వకముందే, ఎవరికీ తెలియ కుండా, నేను నా మనసుని మార్చుకోవాలి. నా ఆశలు అడియాసలు చేసుకోవాలి అనుకున్నా. ఏమైనా సరే; లీలకు, బావకు పెళ్లిజరగాలి అనుకున్నా.

మర్నాడు చిన్నాన్నతో "బావ వచ్చిందాకా ఆగు చిన్నాన్నా! బావ చేసుకోనంటే అప్పుడు మరో సంబంధం చూడవచ్చు. ఇప్పుడదేమంత పెద్ద దయి పోయిందని, పెళ్లి తొందర" అన్నాను.

'సరేలేవే' అన్నాడు ఏ కళనున్నాడో.

అంతే; బావకి ఉత్తరాలు వ్రాయడం మానేశా నాందిగా. కాని, అది చాలదు. బావ పూర్తిగా నన్ను వదులుకోవాలంటే, తన మనసు బాధపడాలి. నా మీద కసి కలగాలి. అందుకని ఒక ప్లాను వేశా. లీలకి ఉత్తరాలు వ్రాసేదాన్ని; అందులో నా స్నేహితు డంటూ ఒక డాక్టర్ను సృష్టించాను. మేం ప్రేమించుకుంటున్నామని, పెళ్లి చేసుకుంటున్నా మని వ్రాసేదాన్ని. బావ నాకు ఉత్తరాలు వ్రాసే వాడు. 'ఎందుకు రాధా! ఈ మౌనం? నా మీద కోపమా? నే నేం చేశాను?' అని బ్రతిమాలేవాడు. "ఇదుగో, మర్యాదగా రాస్తావా మంచిది; లేకపోతే వచ్చి పెళ్లిచేసుకుని చెవులు మెలేస్తా" అని చిలిపిగా కోప్పడేవాడు తన ఉత్తరాలు చదివితే, ఎక్కడ నా నిర్ణయం మారుతుందో అని, అవి చదవకుండానే పడేసేదాన్ని. లీల బావకి ఉత్తరాలు రాయటం మొదలుపెట్టింది. ఎడ్రసు ఇచ్చింది, రాయమని ప్రోత్సహించిందీ నేనే అది ఆ సంగతులూ, ఈ సంగ తులూ వ్రాస్తూ, నా గురించీ, నా డాక్టరు ఫ్రెండును గురించీ రాసేది అమాయకంగా. నాకు కావలసింది కూడా అదే. మెల్లమెల్లగా బావకి నామీద కోపం వచ్చింది. ఉత్తరాలు వ్రాయటం మానేశాడు. లీలకే వ్రాసేవాడు. ఇండియా వచ్చేశాక, మొదట దానిదగ్గరకే వెళ్లాడు. నా డాక్టరు ఫ్రెండు సంగతి తెలుసుకోటానికి, దానికి నేను వ్రాసిన ఉత్తరా లన్నీ చదివాడు. కల్పించి, కథలల్లి నేను వ్రాసిన విషయాలన్నీ నిజమనుకున్నాడు. నేను మోసం చేశాననుకున్నాడు. నాకు ప్రతీకారం తాను లీలను వెంటనే పెళ్లిచేసుకోవటమే అనుకున్నాడు. అందు లోనూ, లీలదగ్గర తను కోరిన గుణాలన్నీ ఉన్నా యేమో, పెళ్లిచేసుకున్నాడు కోరి.

'నాన్నగారికి ఈ విషయాలేవీ తెలియవుగా. బావ లీలను చేసుకుంటానంటే 'పోనీ; నాకు అదీ, రాధ సమానమే, చేసుకో'మన్నారు.

'ఒక రోజు నాకు శుభలేఖ, ఉత్తరం వచ్చాయి, గుర్తుందా? అంటూ పెట్టెతీసి అవి తెచ్చింది. ఇది లీల పంపిన శుభలేఖ. ఇది బావ రాసిన ఉత్తరం.' అంటూ నా చేతి కిచ్చింది. చదివాను:

రాధా!

నువ్వింత దుర్మార్గురాలి వనుకోలేదు. ఏ ఉద్దే శమూ లేని నాకు ఉత్తరాలు రాసి, ప్రేమగా మాట్లాడి కవ్వించి నువ్వంటే అభిమానం పెంచు కునేలా చేశావు. తీరా నేను ప్రేమ ప్రకటించ

## అపార్థం

క్లబ్బులో పేకాట జోరుగా సాగుతోంది. కొత్తగా వచ్చిన రంగారావుగారు తెగ పోగొట్టు కుంటున్నాడు. వంద, రెండు వందలు, అయిదు...చూసిన వారంతా ఆశ్చర్యపడిపోయారు.

"ఏమిటండీ ఈ డబ్బంతా చెట్టుమీదనించి కోసుకొస్తు న్నారా?" అని అడిగాడు ఒకా యన.

"ఛా ఛా! మా ఆవిడని చెట్టంటా రేమిటండీ!" అన్నాడు రంగా రావుగారు.

కె. వి. ఎస్.

# అపార్థం

తోయటానికి ఒప్పుకున్నావు. నీ కిదొక ఆటలా ఉంది. మనుష్యుల జీవితాలతో ఆడటం మంచిది కాదు. నా స్నేహితుడు ఆత్మహత్య చేసుకున్నాడు కాని, నేనంత తెలివితక్కువవాడినికాదు. నీవు కాకుంటే మరొకరు, నీకన్నా ఉత్తములు.

ఆ 'డాక్టరు' విషయం నాకు వ్రాసిఉంటే, సంతోషించేవాణ్ణి, నిన్ను క్షమించేవాణ్ణికూడా. కాని, అంతా దొంగచాటుగా చేసినందుకు నాకు నువ్వంటే అభిమానం పోయి, అసహ్యం వేస్తోంది.

పోనీ, ఆ డాక్టరునైనా చేసుకో. అతన్ని కూడా దగా చేయకు.

ఇక ఎప్పుడూ నీ ముఖం నాకు చూపవద్దు. నా పెళ్లికికూడా నువ్వు రానక్కరలేదు.

నిన్నెప్పుడూ క్షమించలేను.

శ్రీధర్

శ్రీధర్‌ని మింగేద్దామన్నంత కోపం వచ్చింది ఆ మాటే అన్నా! 'ఇంత మూర్ఖు డనుకోలేదు రాధా! మీ బావ' అని.

'అలాన్ని ఏమీ అనకు రమా! ఆ పరిస్థితుల్లో ఏ వ్యక్తైనా అంతే. నేను కోరుకున్నది జరిగింది. నాకు ఆ తృప్తి చాలు. నా జీవితం ఎలాగన్నా గడిచి పోతుంది'.

'ఎందుకు చేశావు రాధా ఈ త్యాగం? ఎవరు సంతోషించాలి ? చివరకు లీలకి కూడా నువ్వు చేసిన మేలు తెలియదు; తెలిస్తే తను బాధ పడు తుంది. ఈ సంగతి తెలిస్తే మీ బావ ఎలా మారిపోతాడో! నాతో ఎందుకు చెప్పలేదు రాధా! ఈ మాట ముందే? వద్దంటాననే కదూ ?'అన్నాను.

'అవును రమా! అనతే ఊగులాడుతున్న మనస్సు, స్వార్థం ప్రక్క వంగిపోవటం తేలిక. నువ్వు నా సుఖం కోరి, నన్ను ఇలాంటి పని చెయ్య వద్దంటావు. నాకు కలిగే కష్టాల్ని, నష్టాల్ని విడమర్చి చెప్తావు. నేను చేసుకున్న నిర్ణయాన్ని మార్చగల శక్తి నీ వాదనకుంటుందని నాకు తెల్సు. అందుకనే చెప్పలేదు రమా! ఇప్పుడు పెళ్లయి పోయింది. వాళ్లు కులాసాగా ఉన్నారు. ఇక నేను నీకు చెప్పినా ఫరవాలేదు. కాని, రమా ! ఎవ్వరికీ ఈ విషయం చెప్పకు. ఇది నేను కోరి చేసింది. ఎవరి పొగడ్త, సానుభూతి నా కక్కరలేదు. నాకు ఒక్కటే చింత. వాళ్లు కులాసాగా ఉంటే వెళ్లి చూద్దా మను కున్నా. కాని, బావ నా ముఖం చూపవద్దన్నాడు. వెళితే అతను బాధపడతాడు. ఏదో అంటాడు. అసలు విషయం లీల పసిగడుతుంది. వెళ్లకపోతే అది బాధ పడుతుంది. కాని, ఫరవాలేదు. ఆ సంతోషంలో, ఆనందంలో నేను రాలేదనే చింత కొంచమే. అదయినా బావ నా పేరు వెంటబెతేనే విసుక్కుంటాడు కనక ఎంతో కాలం ఉండదు' అంది.

'మరి నీ సంగతి?' అన్నాను నేను అయోమయంగా.

నవ్వింది ! 'నాకేం ? అందం ఉంది; పాడతాను. ఉద్యోగం ఉంటుంది. డబ్బుంది. పెళ్లిచేసుకోవా లనుకుంటే ఎవరన్నా చేసుకుంటారు. నా కేం తక్కువ రమా! నీలాంటి స్నేహితురాలున్నంత కాలమూ నా కే లోపమూ ఉండదు' అంది. నేను కటి చిలిపితనం కనిపించింది ఆ మాటల్లో ఎక్కడో. ఎందుకంటే అది ఇక పెళ్లిచేసుకోదని నాకు రూఢిగా తెలుసు.

'అంతే ఇంకేం చెప్పను ? అలాగే ఉద్యోగం చేస్తూ, పాట ఇంకా శ్రద్ధగా అభివృద్ధి చేసు కుంటూ, కాలం గడిపేస్తోంది. కాని, 'దాని జీవితానికి నిండుదనం లేదు. తీరని వెలితి అది. తీరటానికి దానికి ఇష్టమూ లేదు' అంటూ, పూర్తిచేసింది రమ.

నేను నిశ్చేష్టుడనై అలాగే ఉండిపోయాను. ఇంత చిన్నపిల్ల ఎందుకంత త్యాగం చేసిందో అర్థం కాలేదు ఎంతకీ. ఈ ప్రపంచంలో ఇంత నిస్వార్థపరులూ, మంచివాళ్లూ, విశాల హృద యులూ ఉంటారా అని ఆశ్చర్యపోయా. కనీసం ఆమె—కథ నలుగురికీ చెప్పటం రచయితగా నా కర్తవ్య మనిపించింది. కాని, ఎవరికీ తన త్యాగం సంగతి తెలియటం ఇష్టంలేని రాధ, నేను వ్రాశానని తెలిస్తే బాధపడుతుంది. అందుకని పేర్లు మార్చి, జరిగిందే కథగా వ్రాశాను.



యడు. తనను రక్షించిన వారే అయినా వారితో వెళ్లటానికి భయపడింది; ఇదే వింత వాహనమో అని.

ఆ దినం ముఖ్యమయిన సమస్య ఒకటి ఉద్భవించింది. వారివద్ద బిస్కెట్ చాలా తక్కువగా ఉంది; వలభయి కిలోగ్రామ్‌ల కన్నా లేదు. ఎక్కడయినా త్వరలో కొంత తిరిగి సేకరించకపోతే ఆహారవిషయంలో ఇబ్బంది కలుగుతుంది. మర్నాడే క్రాస్నయార్‌స్క్ పట్నం పోయి అవసరమయిన ఆహారసామగ్రి కొనాలని నిశ్చయించుకున్నారు.

కాని, బయలుదేరటానికి ఇంకా చాలాసేపు ఉండనగానే ఆకాశం నిండా మబ్బుపట్టి పెద్ద గాలి వీయటం మొదలుపెట్టింది. వాయు వేగానికి కట్టిఉన్న బెలూన్ ఇటూఅటూ ఆడిపోయింది. ఇవాకి భయం వేసింది. తక్కినవారు అతి కష్టం మీద ఆమెకు ఏ ప్రమాదమూ లేదని నచ్చచెప్ప గలిగారు.

రెండు గంటలసేపు బెలూన్ గాలికి ఊగిపోయింది. కాని మరీ పెద్ద తుమారం ఒకటి వచ్చేసరికి రూయిటర్‌కి కట్టిన ఆరుతాళ్లూ తెగిపోయి త్వరత్వరగా పైకి ఎగసిపోయారు.

ఆరోజు, తర్వాత రాత్రి మేఘాల మీదుగానే ప్రయాణం చేసుకుంటూ వెళ్లారు. మరునటి దినం మాత్రం క్రమంగా వేగం తగ్గిపోయింది. బయటకి కాగితంముక్క ఒకటి విసిరి చూసి అసలు నిశ్చలంగా ఉన్నామని తెలుసుకున్నారు. భూమిమీదకి దిగవచ్చనను కున్నారు.

నేలమీద సుమారు వెయ్యి మీటర్ల ఎత్తు దిగేవరకూ మబ్బు దట్టంగా ఉంది. తర్వాత వాతావరణం స్పష్టంఅయింది.

క్రిందప్రదేశంలో జన సంచారం లేనట్లే కనిపించింది. దక్షిణంగా

# బెలూన్‌లో ధ్రువయాత్ర

21 వ పేజీ తరువాయి

మూడుమైళ్ల దూరంలో ఒక నది కనిపించింది. ఇంకా అవతల, సుమారు పన్నెండుమైళ్ల అవతల ఒక మహా జలరాశి చూడ గలిగారు.

మారిస్‌కి ఇదిఏమిటో అనే సందేహం కలగలేదు. తన బావగారికి చూపించి "కాస్పియన్ సముద్రం!" అన్నాడు.

మారిస్ అభిప్రాయం సరైనది కాదేమో అనే సందేహానికి అవకాశం ఉంది. ఇరవయి ఎనిమిది గంటల కాలంలో మూడువేల కిలోమీటర్లకి తక్కువ కాకుండా ప్రయాణం

టీచర్ : ఏనుగుదంతం ఎప్పుడేనా చూశావా ?

బాలు : చూశాను సార్ —

టీచరు : ఎక్కడ ?

బాలు : ఏనుగు మీద సార్ !

రవణ (శ్రీకాకుళం)

చెయ్యగలిగారంటే నమ్మటానికి కష్టంగా ఉంటుంది. అయినా అంచనాలు సరిగ్గా వేసి చూస్తే సందేహం ఉండదు. ఆ 'తటాకం' కాస్పియన్ సముద్రమే; నదిపేరు 'ఎంబా.' ఈనది పొడవు రెండువందల డెబ్భయి మైళ్లు. 'కిర్గిజ్ స్తాన్' స్టెప్పెల మీదుగా ప్రవహించి కడలు చేరుకుంటుంది.

మంచినీరు చూసి చాలా రోజులయింది. బెలూన్ ప్రయాణికుల హృదయాలు సంతోషంతో నిండాయి. ఉష్ణోగ్రస్థితి 25 డిగ్రీలు ఉంది. ఈ వాతావరణంలో ఆ నిర్మలమయిన సరస్సు చూడటానికి చాలా బాగుంది.

మన యాత్రికులు చేరిన ప్రదేశంలో 'కిర్గిజ్' (Kirghiz) తెగవారు నివసిస్తూ ఉంటారు. స్టెప్పెలను ప్రవేశించిన వారందరితోనూ సుహృద్భా
వం ప్రకటిస్తారని చెప్పటానికి వీల
లేదు. వారికి దొంగతనం, హత్యలు,
దోపిడీలు అలవాటైనన్న సంగతి
మన ప్రయాణికులకి తెలుసు. అంద
చేత వారు ఎక్కడ కనిపిస్తారో అ
జాగ్రత్తగా కాపలా కాస్తూ
వచ్చారు.

సాయంకాలం అయింది. ఆగస్ట
29 ఏ విశేషమూ లేకుండానే గ
చింది. రాత్రి వస్తారేమో అని భయ
పడినా, కిర్గిజ్ తెగవారెవరు
వారికి తగలలేదు.

మర్నాడు, మారిస్ కాస్పియన్
వరకూ వెళ్ళిరావాలన్నాడు. సము
ద్రం సుమారు ఏడుమైళ్ళ దూరంలో
ఉంటుంది. 'ఎంబా'నది కుడితీర
వెంటనే నడిచిపోవటానికి సౌకర్యంగ
ఉన్నట్లు కనిపించింది. అలా
భోజనం అయిన తర్వాత ఆ దా
వెంటనే వెళ్లారు.

మొదట అంతా సవ్యంగా జ
గింది. వాతావరణం హాయ
కాలిపేట్లు ఉండి. వారు నడి
భూభాగం నడకకి కష్టం క
గించేట్లుగా లేదు. పాల్, ఫిలిప్పిన్
బెలూన్‌ని ఈడ్చుకుంటూ వచ్చార
ఇవా, మారిస్‌తో పాటు అంద
కన్నా ముందుగా నడిచివెళ్ళింది.

కొంత సేపటికి వారి కాళ్ళక్రిం
నేల రాళ్ళతో రప్పలతో నిం
పోసాగింది. ఎత్తుకూడా అధికం అ
టం ప్రారంభించింది.

అధికంఅయి అయి చివరకి ఎక్క
టమే కష్టం అనిపించేసరికి అం
కన్నా సులభంగా ఉండే మార్గ
వెతకటం మంచిదని నిశ్చయించ
కున్నారు. నదితీరం వదిలేముంద
ఎత్తయినచోటు ఏదయినా ఉంటే
దానిమీద నుంచుని పరిసరాలని
టినీ కలయ చూడటం మం
దన్నాడు మారిస్. అందరూ
ఊహ కలిగినందుకు అతన్ని అ

# బెలూన్ లో ధ్రువయాత్ర

నందించారు. అతనూ అలాగే చేశాడు.

"ఏమిటి?" అని అడిగాడు పాల్ క్రిందనుంచి.

"ఒక కిర్గిజ్ 'క్యాంప్' (Camp) అనుకుంటాను" అని సమాధానం ఇచ్చాడు.

"చచ్చాం" అన్నాడు పాల్ "వీరు చాలా చెడ్డవారని ప్రతీతి... ఏం చేద్దాం?"

ఫాన్ఎగ్‌బర్గ్ కూడా చకచక పైకి ఎక్కి వెళ్లాడు. ఈ కిర్గిజ్‌లను తప్పించుకోవాలంటే పైకి ఎగిరి పోవటమే అని అతని అభిప్రాయం. కాని పాల్ నది అవతల వడ్డు చేరటం మంచిదన్నాడు.

"కాని, ఇలా నిశ్చలంగా ఉంటే నదిని దాటడమెలా?"

"చాలా సులభం! చూద్దువు గాని రా!"

పాల్ బెలూన్ తాడు ఒకటి తీసి తన నడుంచుట్టూ ఉండే బెల్టుకి కట్టుకున్నాడు. వంటిమీద బట్టలు కొన్ని తీసివేసి ఈదటానికి సిద్ధం అయ్యాడు. మిగిలిన వారందరూ బెలూన్ క్రింది పెట్టె ఎక్కారు.

పాల్ నీటిలోకి ప్రవేశించాడో లేదో, కిర్గిజ్‌లు ప్రత్యక్షం అయ్యారు. వారి ధోరణి ఏమాత్రం బాగా లేదు: కత్తులు కటార్లు పట్టుకుని ఉన్నారు.

పాల్ వారిని చూసి వేగంగా ఈదటం మొదలుపెట్టాడు. ప్రవాహం వేగంగా ఉంది. కాని, ఈతగాడు బలం కలవాడు. అదీకాక నీటి పారుదలకి అడ్డంగా కాక కొంచెం వాలుగా ఈదుతున్నాడేమో, త్వరలోనే అవతలి తీరం చేరుకున్నాడు.

[ఇంకా వుంది]

# తాపం రక్కోలను

15— వ పేజీ తరువాయి

యుడు. కలే అయితే దీప్నే ఆఖరిదాకా ఉండిపోని వ్వండి.''

రత్నకు మళ్ళీ అతడిని పలకరించే సాహసం కలగలేదు.

ఇంటికి వచ్చేసరికి తలుపులు తెరచి ఉన్నాయి. నళిని రేడియో సిలోన్ వింటూ కూర్చుంది.

నళినిని చూడగానే రత్నకు తాను అపరాధి ననిపించింది.

''ఎప్పుడొచ్చావ్ నళినీ ?'' అంది ఆమెవైపు చూడకుండానే.

''అరగంటవుతోంది. దేశాయి గారింట్లో ఆశా ఉంటే, తాళం చెవి తెచ్చి, రేడియో పాటలు వింటూ కూర్చున్నా ఓ.... వమస్తే!'' అంది నళిని అప్పుడే రమేశుడిని చూసినట్టు.

''డాక్టర్ రాలేదా ?'' నళిని అడిగింది.

''లేదు.''

''ఎన్నింటి కొస్తారు ?''

''పది గంటలకు ముందు రారు.''

''నాన్నగారికి ఒంట్లో బాగాలేదు. డాక్టర్ని పిలవమన్నారు. క్లినిక్‌కు ఫోన్ చేశాను అక్కడా లేరు. రేపు ఉదయం క్లినిక్‌కు వెళ్ళేముందు అక్కడికి వచ్చి వెళ్ళమను.''

చేతిలోని గాజులను తిప్పుతూ అంది నళిని అందంగా, చక్రాకారంలో, అజంతా మాదిరిలో వేసుకున్న ఆమె—ముడి ఆమె తెల్లటి మెడను, మరింత బాగా కనిపించ చేస్తోంది. ముత్యాలను గుచ్చిన వల్లటి పట్టుదారపు కుచ్చులు వీపుమీద పడి ఉన్నాయి.

ఎంతటి అందగత్తె నళిని!

కాని, ఏం లాభం ? ఒక యువకుడిని అకర్షించ లేని ఆమె అందం ఎందుకూ ?

రత్న ముగ్ధురాలై నళిని — సౌందర్యాన్ని చూస్తోంది.

తనదీ తప్పే. రమేశుడిని తమ ఇంట్లోకన్నా, నళిని ఇంట్లో అతిథిగా ఉంచి ఉంటే బాగుండేది

రత్న రమేశుడివైపు చూసింది.

అతడు సంకోచంతో ఏమీ మాట్లాడటానికి తోచక అలాగే నిల్చున్నాడు. తనతో అంతగా మాట్లాడే రమేశ్, ఇంకెవరైనా వస్తే మూగ నోము పట్టేవాడు

అంతలో ఆశా తుఫానులా పరిగెత్తుకుని వచ్చి నళిని కాళ్ళను పెనవేసుకుంది

''అమ్మా! నళినక్కయ్య ఎంత బావుందో!''

నళిని పక్కన ఉన్న కుర్చీమీదకెక్కి, ఆమె బుగ్గలు, కంఠం—అన్నీ చేతో తాకి :

''అమ్మా! అక్కయ్య ఎంత బావుందో'' అంది ఆశా

కూతురి సంబరం, ఆనందం చూసి రత్న నవ్వుతూ :

''అంత అందంగా ఉన్నవాళ్ళను అంతగా తాకరాదు; మాసిపోతారు వాళ్ళు'' అంది.

''అవునా అక్కయ్యా ?''

''లేదు ఆశా! ఏమీ కాదు.''

వారి మధ్యలో ఏం మాట్లాడాలో తెలియక వంటరిగా నిలబడిపోయిన రమేశ్, వాళ్ళంతా మాటల్లో—నడటం గమనించి, చప్పుడు చెయ్య కుండా అక్కడినుండి జారుకున్నాడు.

రమేశ్ వెళ్ళిపోవడాన్ని గమనించి రత్న :

''ఆశా! నీ స్నేహితురాలు పిలుస్తున్నట్టుంది చూడు'' అంటూ ఆశను బయటికి పంపింది.

రత్న, నళిని దగ్గరగా జరిగి నెమ్మదిగా :

''నళినీ! నీ కెందుకింత పట్టుదల ?'' అంది.

''అంటే ?

''అదే, రమేశుడితో కొస్త కలిసి మెలిసి తిరిగి..''

రత్న మాట పూర్తిచేయకముందే నళిని బద్ధ కంగా వళ్ళువిరిచి ''నా కేమంత ఆసక్తి లేదులే ఆ విషయంలో'' అంది.

''ఏం ?''

''నిజం చెప్పనా ?'' నళిని సూటిగా చూస్తూ అడిగింది.

రత్న—గుండె గబగబా కొట్టుకుంది. తను 'ఊం' అంటే, నళిని ఏం చెపుతుందో ?

తలవంచుకుంది రత్న.

''నా కొక్కటోయే భర్త నన్నే మనస్ఫూర్తిగా ప్రేమించాలని కోరుకోవటంలో తప్పులేదను కుంటాను. నా భర్త ప్రేమను ఇంకో స్త్రీతో పంచుకోవటానికి నేను సిద్ధంగా లేను.''

''నువ్వు పొరబడుతున్నావు నళినీ....''

''ఇహ ఆ సంగతి వదిలేయి రత్నా. రేపు డాక్టర్ని మా ఇంటికి మరవకుండా పంపాలి. అన్నట్టు ఆశా ఏదీ'' అని మాట మార్చింది నళిని.

తరువాత తొమ్మిదింటిదాకా ఏవో కబుర్లు చెపుతూ కూర్చున్నారిద్దరూ. పొద్దుపోయినట్టే తెలియలేదిద్దరికి. తొమ్మిది గంటలకు నళిని తన వాచి చూసుకుని:

''ఇక వస్తాను'' అంది.

''ఒక్కదానివే వెడతావా ? రమేశ్‌ను రానీ తోడు వస్తారు.''

నళిని నవ్వింది. ఆమె అందమైన పలువరుస ఎర్రటి పెదవుల వెనక తళుక్కుమంది

నళిని మాటాడకుండా తన వ్యానిటీ బ్యాగ్ తిప్పుకుంటూ వెళ్ళిపోయింది.

రత్న చాలాసేపటివరకూ కూర్చున్న చోటి నుండి కదలలేకపోయింది. సుడిగాలిలో చిక్కిన ఎండుటాకులా ఆమె హృదయం అల్లలాడి పోయింది

రెండు విభిన్న భావోద్వేగాల తాకిడికి తట్టుకో లేక పోతోంది రత్న.

రమేశుడి ప్రేమ, స్నేహప్రవాహంలో రత్న అసహాయురాలై ఏదో అవ్యక్త శక్తిచేత నెట్టబడు తున్నట్టుగా తేలిపోతోంది.

అటువంటి నిర్మలమైన ప్రేమను చవిచూసి ఎరుగదామె. భర్తప్రేమ ఆమెకెన్నడూ లభించ లేదు. శేషగిరి మారు వయాస్సైనల డాక్టరు అతడి దగ్గర ఏవిధమైన భావుకతకు కాని, స్నేహ, ప్రేమలకు కాని స్థానంలేదు. అతడి దృష్టిలో హృదయ మంటే దేహానికి రక్తాన్ని సరసరాచేసే అవయవం మాత్రమే. ఎవరయినా హృదయం గురించి మాట్లాడితే, స్టెతస్కోపు చేతిలోకి తీసుకోవ టమే తెలుసు నతడికి

భావుకత హృదయ దౌర్బల్యానికి చిహ్నం అదో రకమైన జబ్బు ఆ జబ్బును ఏ విటమిన్‌తో కూడా నయం చెయ్యలేం. ఒక్కసారి అది మానవుడిమీద

SISTA'S - SG - 189 - A TEL




## తెల్లదనములోని రహస్యము

కళ్లు మిరుమిట్లుగొలిపేలా, ఎక్కువ తెల్లగా ఉంటే దుస్తులలోని రహస్యము క్రమము తప్పకుండా టినోపాల్ వాడడమేనని ప్రతి చురుకైన విద్యార్థికి తెలియును. చీరలు, రవికలు, చొక్కాలు, పేంటులు మొదలగు వాటికి ఎల్లప్పుడూ టినోపాల్ ఉపయోగించండి.

టినోపాల్ ఎంతో పొదుపు కూడ — ఒక బాల్చీడు బట్టలను తెల్లగా చేయుటకు $\frac{1}{4}$ టీ చెంచా టినోపాల్ చాలును. టినోపాల్ యిచ్చే తెల్లదనము 3 లేక 4 సార్లు ఉతికినా పోదు. మీరు బట్టలను ఉతికినప్పుడల్లా టినోపాల్ వాడవక్కరలేదు.




టినోపాల్ జె. ఆర్. గెయిగి, ఎస్. ఎ. బాల్, స్విట్జర్లెండ్ వారి రిజిస్టరు చేయబడిన ట్రేడు మార్కు



ఉత్పత్తిదారులు :
సుహృద్ గైగి లిమిటెడ్ వడి వాడి, బరోడా

సోల్ డిస్ట్రిబ్యూటర్లు:
సుహృద్ గైగి ట్రేడింగ్ లిమిటెడ్ పోస్టు బాక్సు 965, బొంబాయి-1 బి.ఆర్.

దాడి చేస్తే, ఇక అతడు ఎప్పటికీ దాని ఆక్రమణ నుండి, దానివల్ల కలిగే అశక్తత, పరధ్యానం, నిరుత్సాహం—వీటినుండి తప్పించుకోలేడు. కను కనే, ప్రతి మనిషి ఆ జబ్బు తనకు తగలకుండా జాగ్రత్త పడాలి అనే సిద్ధాంతం అతడిది.

భావుకత ఓ అంటురోగం అయినట్టు, అది తన దగ్గరకు రాకుండా జాగ్రత్త వహించాడతడు.

కాని, అతడు కఠిన హృదయుడు కాడు. రత్న—భర్తగా, ఆశ తండ్రిగా, రోగుల వైద్యుడుగా తన కర్తవ్యాన్ని సవ్యంగానే నిర్వహించేవాడు.

తినటానికి తిండి, కట్టుకోవటానికి గుడ్డ, అన్నివిధాల స్వాతంత్ర్యమూ రత్నకుంది. సంపాద నలో సగం తన దగ్గరుంచుకుని మిగతాది రత్న చేతికిచ్చేవాడు. ఇంట్లో తనో అతిథిలాగానే మెలిగే వాడు.

భార్యను ఏ విషయాన్ని గురించీ ప్రశ్నించే వాడే కాదు.

ఆశకు తండ్రిగా, తన కూతురి యోగక్షేమా లను చూసుకునేవాడు. ఒక తండ్రినుండి, ఓ కూతురు ఎన్ని సౌకర్యాలను పొందగలదో, అన్ని సౌకర్యాలను పొందేది ఆశ— ఒక్క ప్రేమను తప్ప. తండ్రిగా అతడు కూతురికి తెచ్చివ్వని వస్తువులేదు. కాని ఎవుడూ కూతుర్ని దగ్గరకు తీసుకుని లాలించేవాడు కాదు. ఆప్యాయంగా కబుర్లు చెప్పే అలవాటే లేదతనికి!

కాని తన రోగులు, తన వృత్తి అంటే మిగతా ప్రపంచాన్నే మరిచిపోయేవాడు. శేషగిరి ఆప్యాయ తను పొందాలంటే అతడి దగ్గరకు రోగిగానే వెళ్ళాలి. అతడి సాంత్వన వచనాలు, భరోసా, వీటన్నిటివల్లనే అతడి రోగుల జబ్బు సగం నయమయి పోయేది.

దానికితోడు అతడి పెదవులపై సదా వెలిగే చిరునవ్వు రోగుల నిర్జీవమైన మొహాల్లో కూడా ఆశను రేకెత్తించేది

రత్న తల్లి కాబోతున్నపుడు, శేషగిరి ఆమె విషయంలో తీసుకున్న శ్రద్ధ, ఆసక్తి ఇంకెవరూ తీసుకోలేరు. ఒక్క నిమిషంకూడా ఆమెను వదలి ఉండటానికి ఇష్టపడేవాడుకాదు.

భార్య ఆహార విహారాల నన్నిటినీ వైద్యుడి దృష్టిలోనే గమనించేవాడు.

ఆశ పుట్టేముందు ప్రసవవేదనతో బాధ పడుతున్న రత్నను వదలి వెళ్ళలేదు శేషగిరి. దగ్గరే కూర్చుని కర్చీఫ్‌తో తను నుదుటిమీది చెమటను తుడుస్తూ, చేతిని నిమురుతూ కూర్చున్న భర్తను రత్న ఎప్పటికీ మరిచిపోలేకపోయింది.

అకస్మాత్తుగా తనమీద భర్త చూపిస్తున్న అగాధమైన ప్రేమనూ, ఆసక్తినీ చూసి చకితురా లయింది రత్న. భర్త ఇదేవిధంగా తన్ను ప్రేమించే టట్టయితే ఇంకా కొద్దికాలం ప్రసవవేదనను అనుభవించగలను అనుకుంది రత్న.

ఆశ పుట్టగానే, శేషగిరి మామూలుగా అందరికి లాగే, ఆమెకూ డాక్టర్‌గా మిగిలాడు. బయట నుండి వచ్చేటప్పుడు నిశ్శబ్దంగా నడిచివచ్చి ఆమె చేతిని తీసుకుని నాడి చూసి, నుదుటిమీద చెయ్యివేసి పరీక్షించేవాడు

"ష్, ఆ చెయ్యి అలాగే నుదుటిమీదనుండి

## తామరకొలను

తల—వెంట్రుకల మీదికి వెడితే!" అని ఆశించేది రత్న—మనసు.

భార్యను పరీక్షించాక, కూతురివైపు మళ్ళేదతని దృష్టి. ఉయ్యాలలో పడుకున్న కూతుర్ని అప్పుడప్పుడూ ఎత్తుకునే వాడు— బరువు చూడటానికి. మూడు నెలల ఆశ, మూడు నెలల బిడ్డ ఉండాల్సినంత బరువు లేకపోతే, ఆలోచనతో మదురు చిట్లించేవాడు. బిడ్డపోషణలో ఏవిధమైన లోపమూ లేనపుడు, బరువు తక్కువగా ఉండటానికి కారణమేమిటి?

ఆ సమయంలో తండ్రిగా బిడ్డను చూసే వాడు కాదతను. డాక్టర్ శేషగిరి తక్కువ బరువున్న బిడ్డను చూసి ఆలోచించేవాడు. ఇహ అప్పటి నుండి కొత్తమందుల ప్రయోగం ప్రారంభమయింది.

పురుడుపోసుకుని మూడు నెలలు పూర్తి కాగానే, శేషగిరి మళ్ళీ ఇంట్లో మామూలు మనిషయ్యాడు.

అతడు బుద్ధిజీవి అయితే, రత్న భావజీవి. భర్త బుద్ధికుశలత, అతడి వృత్తిపైన అతడికున్న అభిమానం, వీటిని రత్న ఎంతో గౌరవించేది. కాని ఇంట్లో ఉన్నపుడైనా, తను డాక్టరన్న మాట మరిచిపోయి భర్తగా మెలిగితే ఎంత బావుంటుంది అని మథనపడేది రత్నహృదయం.

కాని శేషగిరి తన వాళ్ళకూ, బయటివాళ్ళకూ కూడా డాక్టర్‌గానే మిగిలిపోయాడు. తన భార్యను చుట్టుదోవలో ఆమె స్నేహితురాలి ఇంట్లో దిగపెట్టడానికి వెనుదీసే శేషగిరి, పది—పదిహేను మైళ్ళ దూరంలో ఉన్న హాస్పిటలుకు తన కారులోనే తీసుకుని వెళ్ళేవాడు రోగిని.

రత్న పెళ్ళయిన కొత్తలో:

"నాకన్నా మీకు ఆ రోగే ఎక్కువ" అని విసుక్కుంటే, "నువ్వు మీ స్నేహితురాలింటికి బస్సు, ట్రాము, ట్రైను, టాక్సీ — ఎందులోనైనా వెళ్ళగలవు" అని జవాబు చెప్పేవాడు.

"మీ రోగి వెళ్ళలేడనా ?"

"అలా కాదు. ఇప్పటి అతడి పరిస్థితిలో డాక్టర్ అతడి దగ్గర ఉండటం అవసరం. బస్సుకోసం కాచుకూర్చోవటం మంచిదికాదు."

రత్న మళ్ళీ మాట్లాడకుండా ఊరుకునేది. క్రమంగా, మాట్లాడి లాభంలేదన్న సంగతి తెలిసి వచ్చింది. భర్తను అనుసరించి జీవించటానికే అలవాటు—పడింది. కాని, ఒక్కొక్కపుడు 'ఇంట్లోనైనా డాక్టర్‌గాకాక, భర్త సాహచర్యం కావా'లని తీవ్రంగా కాంక్షించే దామె హృదయం. కాని, అది ఆమెకు తీరని కోరికగానే మిగిలిపోయింది. డాక్టర్ భార్యగానే జీవితం సాగిపోతోంది.

ఈ విధమైన వాతావరణానికి అనుగుణంగా జీవితాన్ని దిద్దుకుని సాగిపోతున్న రత్న, అకస్మాత్తుగా లభించిన రమేశుడి స్నేహంతో అవ్యక్తమైన ఆనందాన్ని అనుభవించింది. కాని; క్రమేణా రమేశుడి ప్రేమవిశ్వాసాలు పెరిగినట్టల్లా గాబరా పడసాగింది.

తనను దేవలోకంనుండి దిగివచ్చిన దేవతలా రమేశ్ ఆరాధించటం గమనించి, రత్న మొదట పువ్వులా వికసించింది.

**ఆ ఆరాధన ఎలాంటిది !**

కేవలం గుడ్డి ఆరాధన; చుట్టూ ఉన్న ప్రపంచాన్ని, సౌందర్యాన్నీ విస్మరించి, కేవలం తనొక్కతెనే సజీవమూర్తిగా భావించి రమేశ్ ఆరాధించటం చూసి, రత్న పులకితురాలయింది. ఈ నూతనమైన అనుభవం ఆమె యౌవన, సౌందర్యాలను ద్విగుణీకరించి, వింతశోభనిచ్చింది. కాని, ఈ రకమైన ఆరాధనవల్ల ఆరాధకునికి మంచి కలుగకపోగా, చెడు కలుగుతుందన్న భావన జాగృత మవటంతోనే, రత్న అతడినుండి దూరంగా పారిపోవటానికి ప్రయత్నించింది.

రమేశుడి మీద ఆమెకు అంతులేని ప్రీతి విశ్వాసాలున్న మాట వాస్తవమే. జీవితంలో దెబ్బ తగిలి దుఃఖిస్తున్న వ్యక్తి అని, స్త్రీ-సహజమైన అనుకంపం కలిగింది ఆమెకు. కాని, తన అనుకంపానికి బదులుగా అతడినుండి అపారమైన ప్రేమను నిరీక్షించలేదామె.

అతడి ప్రేమతో ఆమె సుఖి, దుఃఖి.

ఇంతకంటె ప్రేమను దూరం చేసుకోవడమా! ఆమెలోని స్వార్థం, తనను ప్రాణంకన్నా మిన్నగా భావించి, ప్రేమించే రమేశుడి ప్రేమను స్వీకరించి అతడిని తనవాడిగా చేసుకోమని ప్రేరేపించేది.

కాని, ఆమె హృదయం? అతడి సుఖదుఃఖాలను గురించి ఆలోచించేది. తనను ప్రేమించటంవల్ల జీవితంలో అతడికి ఏ మాత్రం సుఖం లేదని తెలుసుకుని క్రుంగిపోయింది రత్న. రమేశుడి దృష్టిని అందాల రాశి నళినివైపు తిప్పటానికి ప్రయత్నించి విఫలురాలయింది.

తన ప్రేమ పథంలో వెనుతిరిగి రాలేనంత దూరం సాగిపోయాడు రమేశ్. ఇంక 'ముందేమిటి' అనే విషయం అతడికి అగమ్యగోచరంగానే ఉండిపోయింది.

ఈ మనో విప్లవంలో రత్న—హృదయం పతనమయి కొట్టుకుపోతోంది.

పరధ్యానంగానే ఆశను అన్నం తినిపించి పడుకోబెట్టింది. చేతిలో ఓ పుస్తకం పట్టుకుని కూర్చుంది. కాని, ఆమె దృష్టి పుస్తకంమీద లేదు. ఇపుడు తనేం చెయ్యాలో అని ఆలోచిస్తూ కూర్చుంది.

రమేశుడిని తననుండి దూరంగా పంపేయాలి.

క్రమంగా అతడు తన్ను మరిచిపోగలడు. ఈ విరహాన్ని భరించటం తనకు చాలా బాధను కలిగిస్తుంది; నిజం. కాని, మందు చేదుగా ఉంటే మాత్రమేం, రోగికి నయం కావటమే ముఖ్యం.

రమేశుడిని పంపించేముందు కొన్ని విషయాలలో అతడి దగ్గర మాట తీసుకోవాలి. వీలయినంత త్వరలోనే ఆ మాట తీసుకోవాలి.

రమేశ్ తలుపు తోసుకుని లోపలికి వచ్చాడు.

రత్న చేతిలో పుస్తకం పట్టుకుని కలగంటోంది

రమేశ్ చనువుతో ఆమె దగ్గరకు వచ్చి చేతిలోని పుస్తకాన్ని లాక్కుని:

"మీ ఆలోచనలకు ఒక్కఅణా ఇస్తాను" అన్నాడు.

రత్న చటుక్కున వెనక్కి జరిగి, నవ్వుతున్న అతడి కళ్ళను చూస్తూ.

"అణా! చాలా తక్కువ" అంది.

"అయితే.... అయితే...." రమేశ్ సందేహించాడు చెప్పటానికి.

"ఏమిటో చెప్పండి" ప్రోత్సహించింది రత్న.

"ఒక తియ్యటి ముద్దు" అన్నాడు ఇంగ్లీషులో.

రత్న ఏదమ కనుబొమ కొంచెం పైకెత్తి "ఊహుఁ" అంది.

"మరేం కావాలి మీకు?"

"నేను చెప్పినట్టు చేస్తానని మాటివ్వండి."

"వీల్లేదు."

"దయచేసి...."

"క్షమించండి."

"అయితే సరే. నన్ను మాట్లాడించకండి. పుస్తకం ఇలా తెండి. నేను చదువుకోవాలి."

రమేశ్ ఇచ్చిన పుస్తకం తీసుకుని చదువుతూ కూర్చుంది రత్న. రమేశ్, రత్న మొహం చూస్తూ కూర్చున్నాడు. రమేశ్ తనవైపే తదేకంగా చూడటం గమనించి అధీరురాలయింది రత్న.

"అలా చూడకండి రమేశ్!"

"ఏం?"

"నేను భరించలేను."

"రత్నా"— అన్నాడు రమేశ్ బ్రతిమాలుకుంటున్నట్టు.

"ఏమిటి?"

"నాకు మీరు కావాలి."

అతడి మాట ఎంతో సరళంగా ఉంది; అతడి ధ్వని ఎంతో మధురంగా ఉంది.

బడినుండి ఆకలితో ఇంటికి వచ్చిన ఆశ,




"అమ్మా ఆకలేస్తోంది. అన్నం పెట్టమ్మా" అన్నంత సరళంగానే ఉందతని కోర్కె.

రత్న తలెత్తి అతడివైపు చూసింది. మెరుస్తున్న అతడి కళ్ళలో పిపాస ప్రజ్వలించటం లేదు. దానికి మారుగా అతడి కళ్ళు ప్రేమార్ద్రతతో మెరుస్తూ ఆశతో రత్నవైపు చూస్తున్నాయి.

ఆమె సోఫాలో కూర్చున్నట్టుగానే ముందుకు వంగి, అతడి బుగ్గలను చేతో మృదువుగా నిమిరి, నుదిటి మీద పడ్డ జుట్టుని వెనక్కి తోసింది మాట్లాడకుండా.

రమేశ్ మళ్ళీ అన్నాడు: "నాకు మీరు కావాలంటే కావాలి."

రత్న తల అడ్డంగా తిప్పింది.

"నేనంటే ప్రేమలేదా మీకు?"

"ప్రేమ ఉందంటే, దాన్ని వ్యక్తపరచటానికి అదొక్కటే మార్గమా రమేశ్? మన ప్రేమ అంత హీన స్థితికి దిగజారక తప్పదా? మీ మీద నాకెంత ప్రేమ ఉందంటే, మిమ్మల్ని ఆ త్రోవలో నడిపించటానికి నా కేమాత్రం ఇష్టంలేదు. నేను తల్చుకున్నట్టయితే ఎప్పుడో మిమ్మల్ని పాడుచేసేదాన్ని. కాని, మీరు జీవితంలో సుఖంగా ఉండాలన్న కోరికుంది నాకు. అటు త్రోవలేకుండా మూసివేయలేను. రమేశ్! నన్ను లోభరచకండి. ప్లీజ్!"

"కాని, నాకు మీరు కావాలి రత్నా! మీరు లేని జీవితం అపూర్ణం".

"ఇప్పుడలా అనిపించినా, ముమ్ముందు అన్నీ సరిపోతాయి. మీ జీవితాన్ని పంచుకునే భాగ్యశాలిని ఓ రోజున వస్తుంది. నేను పతిధర్మానికి కాని, పవిత్రత గురించి కాని, సంఘానికి కాని భయపడి మిమ్మల్ని నిరాకరించటంలేదు. నా దృష్టిలో వాటికి విలువే లేదు."

"అయితే...." అన్నాడు రమేశ్.

"కాని, అంతరంగానికే నేను భయపడుతున్నాను. నేను జీవించినంతకాలం నా అంతరాత్మ నన్ను వేలుపెట్టి చూపిస్తూ ఉంటే, నేను భరించలేను. మీ పవిత్రమైన జీవితాన్ని మలిన—పరచలేను."

రమేశ్ మాట్లాడలేదు. మెదలకుండా కూర్చున్నాడు. ఆఖరికి రత్నే పలకరించింది:

"నా మాటలతో విసుగు పుట్టిందా?"

"లేదు. మీ మనోదార్ఢ్యాన్ని, చిత్తస్థైర్యాన్ని మెచ్చుకుంటూన్నాను. మెప్పుతోనే మీ వైపుకు ఆకర్షింపబడుతున్నాను."

"అలా మాట్లాడకండి రమేశ్!"

"ఏం?"

"మీ మాటలు వినాలనే ఆశతోనే నేను మీతో వచ్చేయగలను."

రమేశ్ ఉత్సాహంతో: "వచ్చేయండి. వెళ్ళిపోదాం" అన్నాడు.

"ఎక్కడికి?"

"ఎక్కడికైనా దూరంగా వెళ్ళిపోదాం."

రత్న నవ్వుతూ అతడి గడ్డాన్ని పుణికి:

"పదండి; భోజనానికి" అంది.

"డాక్టర్ని రానివ్వండి."

"డాక్టర్ కోసం వేచిఉండి లాభంలేదని తెలియలేదూ ఇన్నిరోజులైనా."

"ఫరవాలేదు. నాకింకా ఆకలిగాలేదు" అంటూ టేబుల్‌మీది మెడికల్ జర్నల్ చేతికి తీసుకుని చదవసాగాడు. డయాబిటీస్ గురించి రాసిన కొత్త ప్రయోగాన్ని గురించి వ్యాసాన్ని చదువుతూ అందులో లీనమైపోయాడు రమేశ్.

అది చూసి రత్న మనసులో ఆశ చిగురించింది.

శేషగిరి ఇంటికి వచ్చేసరికి పదకొండు దాటింది. మెడికల్ జర్నల్‌లో మునిగిన రమేశుడికి గాని, నవలలో లీనమైపోయిన రత్నకు గాని పొద్దుపోయిందే తెలియలేదు.

రమేశ్, రత్న—ఇద్దరూ ఒక్కోమూలలో పుస్తకాలు పట్టుకుని కూర్చుని ఉండటం చూసి, నవ్వు వచ్చింది శేషగిరికి.

"భోంచేశావా?" రమేశుడివైపు చూసి అడిగాడు.

"లేదు" అంది రత్న.

భోజనాలపుడు శేషగిరి చెప్పిన విషయం రత్న నిరీక్షించనిది

"ఎల్లుండి బరోడా వెడుతున్నాను."

"ఎందుకూ?"

"అక్కడ వైద్యుల సమ్మేళనం జరుగుతుంది నా స్నేహితులంతా వెడుతున్నారు. నన్నూ రమ్మని బలవంతం చేశారు నేను వెళ్ళి రావటానికి నాలుగయిదు రోజులు పట్టవచ్చు" అంటూ రమేశుడి వైపు తిరిగి.

# తామరకొలను

"నువ్వు రావయ్యా, వెళ్దాం" అన్నాడు శేషగిరి.

"నేను వైద్యుడిని కాను"

"ఇపుడు కాకపోతే ఏం, ఎపుడయినా డాక్టరయ్యే వాడివేగా? చాలా చోట్లనుండి డాక్టర్లు వస్తారు. ఆలోచించి చూడు."

"లేదు; నేను రాలేను. మీరు వెళ్ళిరండి నేను మా ఊరికి వెడతాను" అన్నాడు రమేశ్.

రత్న తలెత్తి రమేశుడివైపు చూసింది

"అపుడేనా ?" అన్నాడు శేషగిరి.

"నేను ఇక్కడికి వచ్చి తక్కువరోజు లయిందా యేం ? రెండున్నర నెలలు కావస్తోంది. మీరు అన్నం పెడుతున్నారు, నాన్న డబ్బుపంపిస్తున్నారని ఎన్నిరోజులు ఉండి పోమ్మంటారు ?"

"అయితే నాదో సలహా నేన బరోడానుండి రాగానే, నువ్వు వెళ్ళిపోదువుగాని, ఏమంటావ్ ?"

రమేశుడి భయమూ అదే— శేషగిరి లేనపుడు తనేమైనా అనుచితమైన పని చేస్తే?— ఆ భయం తోనే తన ప్రయాణం సంగతి ముందుగానే చెప్పాడు.

కాని, ఇపుడు శేషగిరి—మాటలకు ఏం చెప్పాలో తెలియలేదతనికి. అతడింకా ఆలోచిస్తూండగానే రత్న శాంతమైన ధ్వనితో:

"అలాగే లెండి మీరు రొచ్చాకనే రమేశ్ వెడతారు" అంది

రమేశ్ ప్రశ్నార్థకంగా రత్నవైపు చూశాడు. కాని, రత్న మొహం అటువైపు ఉంది

మర్నాడంతా శేషగిరి ప్రయాణపు హడావిడి ప్రతీ పనిలోనూ క్రమం తప్పరాదు. అంతా నీటుగా ఉండాలనే మనస్తత్వం అతడిది బరోడాలో ఉండేది నాలుగు రోజులే అయినా, బట్టలు మాత్రం కొంచెం ఎక్కువగానే సర్దు కున్నాడు

శేషగిరి స్నేహితులతో కలిసి రాత్రి రైలులో ప్రయాణం చేశాడు వెళ్ళేముందు ఆశ, తండ్రి దగ్గరకొచ్చి.

"నాన్నా, గొంతులో నొప్పిగా ఉంది" అంది

శేషగిరి వెంటనే చేతిలోని సంచి కిందపెట్టి టార్చి తెచ్చి పరీక్షించి టచ్ చేశాడు.

"ఆశకు గొంతు నొప్పిగా ఉందట" అంటూ రత్నవైపు ఆరాటంతో చూశాడు

"ఫరవాలేదు తనకు అపుడపుడూ అలాగే అవుతూంటుంది మీరెందుకు కంగారు పడతారు? నేనున్నాను; రమేశ్ ఉన్నారు చూసుకుంటాం" అని ధైర్యం చెప్పింది.

రమేశ్, శేషగిరితో వి. టి. కి వెళ్ళి వీడ్కోలిచ్చి వచ్చాడు

డాక్టర్ శేషగిరి ట్రైను కదిలేముందు:

"ఆశకు పెరుగు వెయ్యవద్దని రత్నతో చెప్పు" అన్నాడు

రమేశ్ ఇంటికి వచ్చేసరికి రత్న ఆశను పడుకో బెడుతోంది ఆశ గొంతునొప్పిగా ఉందని మూలుగుతోంది

రమేశుడికి కొంచెం కంగారుగానే ఉంది

తను అఖరి సంవత్సరం చదువుతున్న మెడికల్ విద్యార్థి అని శేషగిరికీ, రత్నకు అవంటే నమ్మకం.

కాని, రమేశుడికి తనపై తనకే నమ్మకంలేదు.

రమేశ్ రత్నతో:

"శేషగిరి వెళ్ళకుండా ఉంటేనే బావుండేది" అన్నాడు అతడి కంఠంలోని ఆరాటాన్ని గుర్తించి రత్న:

"మీరెందుకలా భయపడతారు? డాక్టరయ్యే మీరే అలా భయపడితే, రోగుల గతేం కావాలి? ఆశకు అపుడపుడు ఇలాగే అవుతూంటుంది. ఫరవాలేదు" అంది శాంతంగా.

రత్న శాంతస్వరం రమేశుడి కలవరాన్ని కొంచెం తగ్గించింది.

రమేశ్ తన గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. కాని, ఆశను గురించిన ఆలోచనతో అతడికి నిద్రపట్టలా. తల్లితోబాటు కూతుర్ని కూడా తనెంతగా ప్రేమిస్తున్నాడో ఇపుడే తెలిసివచ్చిందతనికి. రత్నకు చెందిన ప్రతీ వస్తువుపైనా ప్రీతి విశ్వాసాలు పెంచుకున్నాడు తను. రత్న తన కూతుర్ని ఎంతగానో ప్రేమిస్తుందని తెలుసు నతడికి. అపుడంతా ఆశ తన ప్రతిస్పర్ధి అని అసూయపడ్డాడు. కాని రత్న—కూతుర్ని తను ఎంతగా ప్రేమిస్తున్నాడో ఇపుడే తెలుసుకుంటున్నాడు

ఈ ఆలోచనలతో అతడికి రాత్రంతా సరిగా నిద్రపట్టలేదు.

ఆశకు ఎలా ఉందోనని రెండుమూడుసార్లు లేచివచ్చి చూసి వెళ్ళాడు. మళ్లీ (సశేషం)

---

# విశాలోదంతం

13-వ పేజీ తరువాయి

విన్నడింది వెంటనే వెనక్కుతిరిగి మెట్లుదిగి గేటువేపు పరుగెత్తాడు ఆశ్చర్యపోయారు ముగ్గురమ్మాయిలూ. 'నే చెప్పలేదుటే, అతనికి ఆడ పురుగంటే భయం' అని వ్యాఖ్యానించింది విజయ

సిగ్గుచేతనో, భయంచేతనో (! ?) రాఘవ్ తమ వద్దకు వచ్చి మాట్లాడలేకపోతున్నాడని, తామే వెళ్ళి మాట్లాడాలని ఆపూట ముగ్గురూ, రాఘవ్ రూంకు బయలుదేరారు నోట్సు అతనికివ్వాలనే నెపంతో. వీళ్ళు వెళ్ళేటప్పటికి రాఘవ్ రూంలోనే ఉన్నాడు. లుంగీ చుట్టుకుని, బనీను వేసుకుని చాప మీద కూర్చుని ఫ్లాస్కులోని కాఫీ గ్లాసులో పోసుకు త్రాగే ప్రయత్నంలో ఉన్నాడు. ఈ ముగ్గుర్నీ చూడగానే, అతనికి మూర్ఛపోయినంత పనయింది. 'ఏమిటే, ఇలా దండయాత్రకు బయలుదేరారు, అందులోనూ నా మీదకి' అని ఆశ్చర్యపోయాడు. అంతలోనే తేరుకుని 'రండి! రండి!!' అన్నాడు స్వాగతం చెప్తున్నట్లు అభినయం చేస్తూ.

'వచ్చేవాళ్ళను రమ్మని ఆహ్వానించట మెందుకండీ?' అంది విజయ జవాబు ఏమని చెప్పాలో, తోచలేదు కాబోలు, రాఘవ్ మాట్లాడలేదు. తల గీరుకున్నాడు గూడ.

తర్వాత ఏం మాట్లాడాలో, ఎలా మాట్లాడాలో ఆ ముగ్గురికి గూడ తోచలేదు.

'ఇప్పుడే రెండర (కప్పు)లు కాఫీ తెచ్చుకున్నాను. నలుగురం షేర్ చేసుకుందాం' అన్నాడు రాఘవ్ ధైర్యపడుతూ

'ఇదేం అతిథి మర్యాద?' అన్నది విజయ. అల్మరులోని గాజు గ్లాసుల్ని అందుకున్నాడు రాఘవ్.

'విన్న మాట్లాడాలి రమ్మనమంటే, రాలేదేమండీ!' రాజ్యలక్ష్మి అడిగింది

రాఘవ్ క్షమించమన్నట్లు ముఖంపెట్టి, 'విన్న అర్జంటుగా రూముకు పరుగెత్తాల్సిన అవసరం కల్గిందండీ. అందువల్ల రాలేకపోయాను' అన్నాడు.

'ఇవాళ స్టెయిర్‌కేస్‌వద్ద మమ్మల్ని చూచి పరుగెత్తుకువచ్చింది కూడ అందుకే?' విజయ ప్రశ్నించింది కాఫీ గ్లాసును అందుకుంటూ.

ఒక్క క్షణం మౌనంగా వుండి, 'నిజం చెప్పమంటారా' అన్నాడు రాఘవ్.

'ఏమిటీ! తోట-రాముడిలాగా అడుగుతున్నారు?' విజయ అంది. నల్గురూ నవ్వుకున్నారు.

'మీరు స్టెయిర్‌కేస్ దిగుతుండటం, నేను మీకు ఎదురు రావటం— నా కొక సంఘటన గుర్తుకొచ్చి భయంవేసిందిలెండి' అన్నాడు.

'ఏమిటది?' రాజ్యలక్ష్మి అడిగింది ఈ సారి.

'ఒకసారి.... రెండు సంవత్సరాల క్రితం ఒక అమ్మాయి, ఒక అబ్బాయి ఆ స్టెయిర్‌కేస్‌మీద ఒకరికొకరు అభిముఖంగా వెళ్తూ తారసపడ్డారు. మగవాడు కదా, దారి తొలుగుదామని ఆ అమ్మాయి ఒక ప్రక్కకు తప్పుకుంది. పాపం! అమ్మాయికదా దారి తొలుగుదామని అబ్బాయి అదే సమయానికి అదే ప్రక్కకు ఒదిగి నిల్చున్నాడు. అప్పుడా అమ్మాయి మరో ప్రక్కకు తప్పుకుంది. అదే సమయానికి అబ్బాయీ అదే పని చేశాడు. ఇలా ఒకరి కొకరు దారి తొలుగుదామని ప్రయత్నించటంతో ఎవరూ రెండవవారికి దారినివ్వలేకపోయారు. ఈ దాగుడు మూతలాటకు ఆ అమ్మాయి అపోహపడి అబ్బాయి తనని పరాభవించాడని ప్రిన్సిపాల్‌కు రిపోర్టు చేసింది. ఫలితంగా అబ్బాయికి డిస్మిస్—శ్రీముఖం చేతికొచ్చింది. . నాకూ ఆ గతి పడ్తుందేమోనని భయపడి....'

అమ్మాయిలు ముగ్గురూ ఒకరి ముఖాలొకరు చూచుకున్నారు.

"మీ ఇంగ్లీషు నోట్సు ఒకసారి ఇస్తారూ?" అన్నది విజయ టాపిక్ మారుస్తూ.

"సారీ, నా ఇంగ్లీషునోట్సు ఎక్కడో పోగొట్టుకున్నానండీ మీ కెవరికైనా దొరికిందా?"

"బావుంది, మాకు దొరికితే మిమ్మల్నెందుకు కడుగుతాం?"

విజయ—మాటలకు అడ్డువస్తూ, రాజ్యలక్ష్మి అంది:

"నాకు దొరికిందండీ, ఇదిగో."

"చాల థాంక్సండీ! ఈ పరీక్షల టైంలో అది పోతే, చాల ఇబ్బందిపడేవాడిని. మీ రుణం ఎలా...."

"తీర్చుకోవాలంటే ఒక మార్గముంది. మా కో ఉపకారం చేసిపెట్టాలి."

"ఏమిటది. ?"

"ఇప్పుడా ముఖ్యవిషయాన్ని మీకు చెప్పటానికే వచ్చాం" అన్నది రాజ్యలక్ష్మి.

"ఏమిటది.?"

"మీ ధర్మారావుమీద మా విశాల రిపోర్టు ఇచ్చింది ప్రిన్సిపాల్‌కు."

"ఏమని ?"

"ఆ ధర్మారావు తనని మారుపేర్లు పెట్టి పిలుస్తూ అల్లరి చేస్తున్నాడని."

రాఘవ్ ముఖం చిన్నబోయింది. మిత్రుడికి ఏ శిక్ష పడుతుందోననే బాధ అతని ముఖంలో ప్రస్ఫుటమైంది. "ఎంత పొరపాటు చేశారండీ ?" అన్నాడు మెల్లిగా

"పొరపాటేముంది ?" అంది విజయ

"మన ప్రిన్సిపాల్ విషయం మీకు తెలుసు కదా, కర్కోటకుడు. ధర్మారావును డిస్మిస్ చేసినా చెయ్యవచ్చు. అతని భవిష్యత్తు నాశనంకాదూ?" అన్నాడు జాలిగా.

రాజ్యలక్ష్మి జవాబు చెప్పింది: "అవున్లెండి. మీరు మాత్రం మగవాళ్ళుగదూ! మీ ఫ్రెండ్‌ని సపోర్టు చెయ్యక మమ్మల్ని సపోర్టు చేస్తారా ? మీ ధర్మారావు మమ్మల్ని అల్లరిపెడ్తూ, మా జీవితాలతో చెలగాట మాడటం బాగుంది గాని, మా రక్షణకు మేము ప్రిన్సిపాల్‌తో చెప్పటం బాగులేదంటారు. అవునా ?"

"నే నలా అనలేదు. అనలేను గూడ. కాని, నాతో మాట మాత్రం చెప్తే, ధర్మారావును మందలించక పోయానా అని."

"అయితే ధర్మారావుకు మీరు గార్డియనా ఏం ఖర్మ ?" అని విజయ అడిగింది.

"మీ రేమైనా అనుకోండి.కాని...."

"ఇప్పుడు మునిగిపోయింది లేదు. మీరు మీ ధర్మారావును మందలించి అతని అల్లరిని మాన్పించండి. అలా జరుగకపోతే, మేం నిజంగా ప్రిన్సిపాల్‌కు రిపోర్టిస్తాం" అన్నది రాజ్యలక్ష్మి దృఢంగా.

"అంటే ఇప్పటికివ్వలేదన్నమాట !" రాఘవ్ ఆశ్చర్యంగా, ఆనందంగా అన్నాడు.

"లేదు. ఇక మీ ప్రయత్నం చెయ్యండి. వస్తాం" అంటూ లేచింది రాజ్యలక్ష్మి.

దారిలో విశాలతో అంది విజయ : "ఏమే విశాలా! ఆ ధర్మారావును అన్ని తిట్లు తిట్టావు. ప్రిన్సిపాల్‌కు రిపోర్టు చేస్తానన్నావ్, ఆ రాఘవ్ ముందు నోరు మెదపలేదేం ?"

"నే నెందుకో మాట్లాడలేక పోయానే" అంది విశాల నెమ్మదిగా.

"ఆఁ !" అని నోరు తెరచింది విజయ.

## 3

మరి మూడురోజుల తర్వాత కాలేజీకి వస్తూ ఒక వార్తను మోసుకొచ్చింది విజయ ఆ వార్త బరువును అప్పటివరకూ మోసినందుకు అలసినట్లుగా 'హమ్మయ్య' అని నిట్టూర్చింది వెయిటింగ్ రూమ్‌లో కాలు పెడ్తూ.

"ఏమిటి, ఏమిటి" అంటూ ఎగబడ్డది మిత్ర బృందం. వీళ్ళందరినీ కొంచెంసేపు అలాగే అడగనిచ్చి "అసలేం జరిగిందో తెలుసా?" అంది విజయ ఆయాసంనించి తేరుకుంటూ.

"ఏమిటో చెప్పోస్; పెద్ద సస్పెన్సు నువ్వూను" అంది ఓ భామ.

"చెప్పవే" అంది రాజ్యలక్ష్మి ప్రాధేయపూర్వకంగా

"మన ఎత్తు పారిందే. రాఘవ్...."

విశాల తలెత్తి శ్రద్ధగా వినసాగింది

" .... ధర్మారావును మందలించాడుట విశాల జోలికి పోవద్దని .."

"ఆఁ" అన్నారు అందరూ ముక్తకంఠంతో.

".... ఆ మీదట వారిద్దరికీ వాదోపవాదాలు జరిగినవిట. ముష్టిముష్టి దాకా ముదిరిందిట వ్యవహారం. చివరకు ఎలాగైతేనేం ధర్మారావు మాట యిచ్చాడుట విశాల జోలికి వెళ్ళనని"

"ఎవరు చెప్పారుట" రాజ్యలక్ష్మి ప్రశ్నించింది.

"అభిజ్ఞ వర్గాలవారు ... అంటే విద్యార్థులందరూ.... ఎవరి నోట విన్నా ఇదే" విజయ బదులు చెప్పింది.

"కాని, నా కొకటే అనుమానం...." రాజ్యలక్ష్మి వెలిబుచ్చింది.

"ఏమిటే, నీకన్నీ అనుమానాలే" అంది విజయ.

"ధర్మారావు నిజంగా తన ప్రవర్తనను మార్చుకుంటాడా అని"

"ఏమో చూద్దాంగా, తొందరెందుకు."

## 4

"ఛీ. ఛీ. అందరూ అందరే. పయోముఖ విషకుంభాలు. దేనికైనా ఒక లిమిట్ ఉండాలి. పిల్లికి చెలగాటంగా వుంటే, ఎలుకకు ప్రాణసంకటమని వీరికి తోచదు గాబోలు; కల్చర్‌లెస్ బ్రూట్స్...."

వెయిటింగ్ రూంలో అడుగుపెడ్తూనే, విశాల అన్న మాటలకు అక్కడ ఉన్నవారంతా విస్తుపోయారు. విశాల బెంచీమీద కూలబడింది ఆమె ముఖం జేవురించివుంది. ఆవేశంతో ఉచ్ఛ్వాస నిశ్వాసాలు వడివడిగా వస్తున్నాయి.

"ఏమిటే విశాల! మళ్ళీ ఏం జరిగింది ?" అని అడిగింది రాజ్యలక్ష్మి.

"చదువుతున్నారు. సంస్కార ముందంటారు. స్త్రీలకు పురుషులతో సమాన హక్కులు కల్పిస్తామని వేదికలెక్కి ఉపన్యాసాలిస్తారు మళ్ళీ ." విశాల దండకం చదువుతోంది.

"అసలు సంగతేమిటో చెప్పవే. మళ్ళా ధర్మారావు ఏమన్నా అన్నాడా ?"

"ఏమిటా, ఇదిగో చూడు" విశాల ఒక శుభలేఖను విసిరింది రాజ్యలక్ష్మిపైకి.

రాజ్యలక్ష్మి శుభలేఖను చదివింది: "ఇదేమిటే! విశాలకు, రాఘవ్‌కు పెళ్ళా ! ఏమిటీ వైపరీత్యం"

అమ్మాయిలలో కల్లోలం చెలరేగింది.

"ఇదంతా ఆ రాఘవ్ చేసిన పనే వద్దే అంటే విన్నావూ ? బలాత్కారంచేసి రాఘవ్ రూమ్‌కు లాక్కెళ్ళావు. మనం అతని రూంకు వెళ్ళటం అలుసుగా తీసుకొని నన్ను ఇంకా అల్లరి చెయ్యటానికి ఈవిధంగా శుభలేఖలు వేయించివుంటాడు రాఘవ్. నిన్న మా నాన్న ఆఫీసు అడ్రసుకు వచ్చిందిట ఇది. ఆయన వచ్చి చూపిందాకా నాకు తెలీదు. ఆయన అగ్గిరాముడైనాడు. నామీదనే అనుమాన పడ్తున్నాడు.... ఇవాళ నేను వస్తుంటే స్టూడెంట్సంతా ఒకటే గుసగుసలు, నవ్వులు...." విశాల కన్నీరు పెట్టింది.

"ఇది రాఘవ్ చేసిన పనిగా తోచటంలేదు. అతను ఇలాంటి పని చేయడు. ఇందులో మోసముండి ఉంటుంది." రాజ్యలక్ష్మికి ధర్మారావు మనసులో మెదిలాడు విశాలను అల్లరిచేయవద్దని రాఘవ్ చెప్పటంవల్ల, కోపంతో ధర్మారావు ఇద్దరినీ ఒకేసారి అవమానపరచాలని ఈ పని చేశాడేమో ననిపించింది

"ఇంకా మోసమంటావేమిటే. ఇది తప్పకుండా రాఘవ్ చేసిన పనే. సందేహంలేదు. పైకి ఎవరితోనూ మాట్లాడకుండా ముభావంగా వుండే వాళ్ళే గుండెలుతీసే బంట్లు ఇవాళ వెళ్ళి అతని పని పడ్తాను" విశాల ఆవేశంతో అంది.

"ఏం చేస్తావ్ ?" రాజ్యలక్ష్మి అడిగింది.

"చూస్తావుగా "

రాజ్యలక్ష్మి నిట్టూర్చింది. కొన్ని నిముషాలు ఆలోచించి రాజ్యలక్ష్మి అంది : "సరే, సాయంకాలం అందరం కలసి అతని రూంకు వెళ్దాం. అన్ని విషయాలు అక్కడే తెలుస్తవి.... మీ నాన్నగారిని గూడ రమ్మను విశాలా ! ఆయన అనుమానంగూడ రహితమవుతుంది "

## 5

ఆ రోజు సాయంకాలం ముగుదలు ముగ్గురూ, విశాల—నాన్నగారు, రాఘవ్—రూంకు వెళ్ళేసరికి

# విశాలోదంతం

అతని రూమ్ జనంతో నిండివుంది. గది మధ్యలో రాఘవ్ విచారంగా కూర్చుని వున్నాడు అతని ప్రక్కనే ఒక వయసుమళ్ళిన వ్యక్తి కుర్చీలో కూర్చున్నాడు.

రాజ్యలక్ష్మి వగైరాలను చూడగానే "వియ్యాలవారు వస్తున్నారు; మర్యాదలు జరపండి' అన్నది ఓ గొంతుక. అందరూ నవ్వారు.

రాఘవ్ ఆ మాట వినగానే తలఎత్తి రాజ్యలక్ష్మి-వాళ్ళను చూచి ఎదురువచ్చి "చూశారా! ఏం జరిగిందో, ఎవడో ఫూల్ నన్ను, విశాలగారిని అల్లరిచేయాలని ఈ పని చేసివుంటాడు శుభలేఖ మా నాన్నగారికి పంపారుట. మీ నాన్నగారికికూడ పంపారుగదూ! వీరేనా మీ నాన్నగారు? నమస్కారమండి!" అన్నాడు.

"ఆగు, నీ దొంగనమస్కారాలూ నువ్వూను. నీ సంగతి నాకు తెలియదనుకుంటున్నావా? ఇంటి నుంచి వచ్చే డబ్బును జల్సాచేస్తూ, వళ్ళూ-పై తెలియకుండా ఇదా మీరు చదివే చదువు? ఆడపిల్లల్ని అల్లరి చేయడమేనా? నీమీద పరువు నష్టం దావావేసి నిన్ను కోర్టుకు లాక్కపోతే నా పేరు జానకిరామయ్యకాదు.." విశాల తండ్రి ఉగ్రుడైనాడు

"అయ్యా జానకిరామయ్యగారూ! నా దొక మనవి ఈ శుభలేఖలు అచ్చువేయించింది నేను గాదు. నే నే పాపం ఎరుగను ఇలాంటి అల్లరి జరిగినందుకు మీకంటె నే నెక్కువ విచారిస్తున్నాను నిజం నిలకడమీద తెలుస్తుంది. మీ రనవసరంగా ఆవేశపడకండి" అన్నాడు రాఘవ్

"ఆఁ ఆఁ, పైగా నన్నే అనవసరంగా ఆవేశపడొద్దని నీతులుచెప్తావా? చూడు, నిన్నేంచేస్తానో..." జానకిరామయ్యగారు మాటలు వెతుక్కున్నారు

ఇంతలో అక్కడ కుర్చీమీద కూర్చున్న పెద్దమనిషి లేచి జానకిరామయ్యగారిని ఎదుర్కొన్నారు "ఏమిటయ్యా! మావాడు ఏమీ ఎరగనంటుంటే వాడిమీదకి లేస్తావ్. ఈ పని చేసింది వాడే అయితే శుభలేఖ నాకెందుకు పంపుతాడు? వెనకా ముందు ఆలోచించి మరీ మాట్లాడండి." లా పాయింట్ తీశాడు దశరథ రామయ్యగారు కొడుకువేపు వకాల్తా పుచ్చుకుని.

"అయ్యా పెద్దలారా! మీకొక నమస్కారం మీకంటే వయస్సులో పెద్దవాణ్ణి. నే నొక్క విషయం మనవి చేస్తాను అవధరించండి. అబ్బాయి మంచివాడు. అల్లరి చిల్లరవాడుకాదు. ఆ సంగతి నాకు తెలుసు. ఇక అమ్మాయి విశాల సంగతంటారా అడగనక్కర్లేదు. సుగుణాల ఖని అని అంటుంటే విన్నాను. వీరిద్దరికీ వివాహమంటూ — ఎగతాళిగానే అనుకోండి— వేసిన శుభలేఖలు అందవలసినవాళ్ళకు అందరికీ అందినయ్. ఇలాంటి సందర్భంలో మీరు నిజంగానే వియ్యమందితిరా, ఈ శుభలేఖలు అచ్చువేయించినవాడి నోరు నొక్కినట్లుంటుంది. మీరు నవ్వులపాలుకారు. ఆ పైన మీ ఇష్టం" అన్నారు ఆ ఇంటి ఓనరు పేరయ్యగారు. ఇలాంటి వివాహాలు ఒకటి రెండు చేయించాడని ప్రతీతిలెండి.

జానకిరామయ్యగారు, దశరథరామయ్యగారు ఒకరి ముఖాలొకరు చూసుకుని జాయింట్‌గా విశాల, రాఘవ్‌లను చూశారు. రాఘవ్ విశాలను చూశాడు. విశాల తల వంచుకుంది. 

## వదంతులను వినకండి
## వదంతులను ప్రచారం చేయకండి






# సొగసుగా కనపడండి... 'హేజలైన్' సౌందర్య సాధనలలో మీ ముఖమును కలకలలాడేలా చేసుకోండి

**స్నో ★ కోల్డ్ క్రీమ్ ★ టాల్కం**

సువాసనగల ఫై సౌందర్య సాధనలలో ప్రతి ఒక్కటి మీ ముఖమునకు ప్రత్యేకమైన అందమును కలిగిస్తాయి.

* "'హేజలైన్' స్నో"—మీ ముఖమునకు రక్షణనిచ్చి దానికి శోభను చేకూరుస్తుంది.
* 'హేజలైన్' కోల్డ్ క్రీమ్ మీ ముఖ చర్మమును బాగుగా శుభ్రపరచి దానిని మృదువుగా ఉండేలా ఉంచుతుంది. మీ ముఖము నవనవలాడుతూ యవ్వనవంతముగా కనపడుతుంది.
* 'హేజలైన్' టాల్కం సువాసనగల మృదువైన పౌడరు. దానిని జల్లుకొంటే మీరు ఆహా ఎంత చల్లదనము, అబ్బా ఏమి తాజాదనము, అరె ఎంత సువాసన అంటారు!









**బర్రోస్ వెల్‌కం తయారులు**

BWT-10-TEL.

# న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

కాని నిజం చెప్పాలంటే శ్రీ నెహ్రూ ఒక అద్దాల గృహంలో ఉన్నారు. ఎటు చూసినా నెహ్రూయే కనిపిస్తారు. నిజానిజాలు నిర్మొహమాటంగా ఆయనకు చెప్పేవారు లేకపోవటం ఆయనకీ, మన దేశానికీ కూడా పట్టిన దురదృష్టం. ఆయన చుట్టూ చేరినవారంతా అన్నిటికీ అవుననేవారే. చైనా దురాక్రమణ తర్వాత లేచిన జాతీయ చైతన్యాన్ని నెహ్రూ వృథాచెయ్యటం కూడా మన దురదృష్టమే. తనకు కావలసినప్పుడెల్లా మంత్రంవేసినట్లు ఈ చైతన్యం కలుగుతుందనుకొనటం ఆయనకు ఆత్మవంచన తప్ప వేరే కాదు. ఈ మూడు ఉపఎన్నికల లోనూ ప్రజాభిప్రాయం వైఖరి తెలిసిపోతున్నది.

ప్రజలందరూ త్యాగం చెయ్యాలంటూ, కాంగ్రెస్ మంత్రులు విపరీతంగా ఖర్చులు పెంచుకొనటం ప్రజలకు అర్థం కావటం లేదన్న విషయం శ్రీ నెహ్రూ గుర్తించని వాటిలో మరొకటి. మే,లో శ్రీ నెహ్రూ గుజరాత్‌కి వెళ్ళి ఒక నూనె వరి శుభ్రం చేసే కేంద్రానికి పునాది వేశారు. త్వరలో అస్సాంలో ఒక వంతెన ఆవిష్కరించనున్నారు. తమ మంత్రివర్గం సంఖ్య తగ్గించటానికి అంగీకరించలేదు. వివిధ మంత్రుల వ్యర్థ వ్యయాన్ని అరికట్టటానికి కావలసిన ప్రయత్నాలు చెయ్యటంలేదు వారి ఖర్చులు చూస్తే మహాత్మాగాంధి నిరాహార దీక్షకి పూనుకునేవారు.

'ఉత్తుత్తి పొదుపు' ఎటువంటిదో ఒక ఉదాహరణవల్ల తెలుసుకొనవచ్చు. శ్రీ ఢేబర్‌భాయ్ ఖాదీ కమిషన్‌కి అధ్యక్షులు అయ్యారు. ఆయన ముందున్న శ్రీ మెహతా, జీతంకాని, ఇంటి భత్యంకాని తీసుకొనలేదు. ఎక్కడికయినా వెడితే అయిన ఖర్చు రాసేవారు, అంతే. ఢేబర్‌భాయ్‌గారు అంతా మార్చేశారు ఆరువందల రూపాయల నికర వేతనం కోరారు. అన్ని సౌకర్యాలూ కల ఇల్లు కావాలన్నారు. కారు, కొందరు సెక్రటరీలు అవసరం అన్నారు. ఈ పొదుపువల్ల మిగిలేది ఏమిటి? సుమారు నెలకి మూడువేల రూపాయల అదనపు ఖర్చు. ఒక విధంగా శ్రీ ఢేబర్‌భాయ్ కరాచి కాంగ్రెస్‌లో శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ ప్రతిపాదించిన తీర్మానం—నెలకి అయిదువందల కన్నా ఏ కాంగ్రెస్‌వాది కూడా జీతం తీసుకొనరాదని—పాటిస్తున్నారనవచ్చు!

కొందరు కాంగ్రెస్ వారూ (కొన్ని పత్రికలూ), ఆచార్య కృపలానీ విజయం తిరోగమన వాదుల విజయం అన్నారు. అసలు తిరోగమన వాది ఎవరు? పురోగమనాన్ని కాదనేవాడే కదా! అంటే, ఆచార్య కృపలానీ తిరోగమనవాది, హాఫీజ్ సాహెబ్‌గారు పురోగమన వాది అనేకదా అర్థం? మతగురువుల వెంట తిరిగినందుకు పాకిస్తానీలు తిరోగమన వాదులని నెహ్రూ అన్నారు. ఈ ఎన్నికలలో హాఫీజ్ సాహెబ్‌గారి కోసం మతగురువుల చేత ప్రచారం చేయించారు!

శ్రీ మీనన్ నాయకత్వంక్రింద కొందరు కాంగ్రెస్ వారు హాఫీజ్ సాహెబ్‌గారు రాజీనామా ఇవ్వనవసరంలేదని వాదిస్తూ వచ్చారు. హాఫీజు సాహెబ్‌గారు వార్తా పత్రికలకి ఇంటర్‌వ్యూ ఇచ్చి, తను రాజీనామా చెయ్యవలసిన అవసరం కనిపించలేదన్నారు కూడా.

ప్రధానమంత్రి రాజధానికి తిరిగి రావటంతో అంతా మారిపోయింది హాఫీజు సాహెబ్‌గారు ప్రధాన మంత్రిని కలిశారు రాజీనామా ఇవ్వబోతున్నారని ఆ వెంటనే విన్నాము. దీనికి ప్రధానమంత్రిని హృదయపూర్వకంగా అభినందించాలి. లోక్‌సభ ఎన్నికలో అపజయం పొందిన వ్యక్తిని రాజ్యసభకి కాని, గవర్నర్ పదవికి కాని పంపరాదని శ్రీ నెహ్రూ ఒకసారి చెప్పారు ఇది అభినందనీయమయిన సిద్ధాంతము

హాఫీజు సాహెబ్‌గారు మంచి పెద్దమనుష్యులు. కాని, మంత్రిగా రాణించనివారు. వారి నిష్క్రమణ ఎవరికీ విచారం కలిగించదు. అదీకాక వారికి వయస్సు అయిపోయింది. విశ్రాంతి అవసరం.

కాని, ఈ మూడు ఉప ఎన్నికలలో కలిగిన అపజయాలను పరిశీలించనున్న కాంగ్రెస్ నాయకత్వం విశ్రాంతి తీసుకొనరాదు. కాంగ్రెస్ నాయకులు తమ పార్టీకి కొత్త ప్రాణం పొయ్యాలి. తిరిగి కాంగ్రెస్ పార్టీ నూతన శక్తితో కళకళలాడాలి

భారతదేశానికి కాంగ్రెస్ పార్టీ అత్యవసరం. ★

● పెద్ద షాపులవారు, విద్యుచ్ఛక్తి ఇవ్వటానికి వీల్లేదని, తిరస్కరించినప్పుడు, ఈ షాపులవారు, తమ హక్కుల కేదో భంగం కలిగినట్టు, కోర్టులకు వెళ్లటంకూడా ఉంది. రహదారికి ఆటంకం కలిగించటంలో, ప్రత్యక్షంగా కాకపోయినా, ఈ షాపులుకూడా తమ పాత్ర వహిస్తూనే ఉన్నాయి. వీటికితోడు, 'పెళ్లినడక' బళ్లు, రిక్షాలు, సైకిళ్లూ కూడా ఉండనే ఉన్నాయి. పట్టణాన్ని పరిశుభ్రంగా ఉంచాలంటే, కేవలం,

# రాజధాని కబుర్లు

(9—వ పేజీ తరువాయి)

మునిసిపాలిటీ వారిదే బాధ్యత అయినప్పటికీ, ప్రభుత్వంవారితోనూ, మిగతా ఇండిపెండెంట్ సంస్థలతోనూ, తగినంత సహకారంతో వ్యవహరించకపోతే, ఇది సాధ్యంకాని మాట వాస్తవం. దాదాపు ఇరవై వేలలోపు రిక్షాలు తిరుగుతున్న 'బ్రైషిబాద్' అంటే, విశాల హైదరాబాదులో ట్రాఫిక్ కంట్రోల్ ఒక సమస్యే నిజానికి! ఢిల్లీ, బొంబాయి వంటి పట్టణాల్లో, రిక్షాలమీద నిషేధం ఉంది ఇతర పట్నాల్లోకూడా వీటిని తగ్గించటానికి తగిన చర్య తీసుకుంటున్నప్పుడు, హైదరాబాదు పట్నంలో ఈ రిక్షాల సంఖ్య, యేడాది యేడాదికి పెరుగుతూ ఉండటం ఆశ్చర్యకరమైన విషయమే! ఇంచుమించు లైసెన్సు లేకుండా, పదివేలదాకా రిక్షాలు తిరుగుతున్నట్లు

అంచనా ! అప్పుడప్పుడు అమాంతం వాటిని పట్టుకోవటం, వదిలెయ్యటం జరుగుతూనే ఉంటుంది! స్పీడుగా వేళ్లే బండ్లవలన రహదారికి సమస్యంటూ ఉండదు. కార్లు, బస్సులు మోటారు సైకిళ్లూ, అన్నీ కలిసి మొత్తం, పద్దెనిమిది వేల లోపు ఉంటుందని అంచనా ఇవిట్లా ఉండగా, కాలి—బాటమీద, తాత్కాలికపు వసతి గృహాలు ఏర్పరచుకుని, రాత్రిళ్లు సుఖంగా నిద్రించే బీదాబిక్కీ జనం సంగతి పట్టించుకోవటం లేదు. ఇళ్లూ వాకిళ్లూ లేని బీదవాళ్లకు, బిచ్చగాళ్లకు నివాస సౌఖ్యం విషయమై, మునిసిపాలిటీవారు యేమీ శ్రద్ధ కనబరచటంలేదు. మునిసిపాలిటీవారు వసూలు చేస్తున్న డబ్బంతా యేమి చేస్తున్నట్టు అనే ప్రశ్నమీద తెలంగాణా ప్రాంతీయపు కమిటీవారు, ప్రభుత్వంవారిని హెచ్చరిస్తూ, వారిచేత మునిసిపాలిటీవారికి ఓ తాఖీదు కూడా పంపించారు !

రోజు రోజుకు ఇతర ప్రాంతాల్నుంచి వచ్చి, రాజధానిలో సందుల్లోనూ, కాలిబాటలమీద నివసిస్తూ, ఉన్న కాస్త పరిశుభ్రతకు భంగం కలిగించే వీరికి, నివాస వసతులు, మునిసిపాలిటీవారు కలిగించాలని, హెచ్చరిక చేయటం కూడాజరిగింది అయితే మునిసిపాలిటీవారు, వీరి వసతులకు ఒక పథకం తయారు చేసినట్టూ, అయితే ప్రభుత్వంవారే, తగిన ఆర్థిక సహాయం, ఇతరత్రా సహకారం యివ్వటంలేదని ఆరోపణ చేసింది. ఇదిట్లా ఉండగా, భారత ప్రభుత్వం వారే, ఇలాంటి వారి నివాస యోగ్యానికి ఒక పథకం తయారు చేసినట్లు తెలుస్తోంది. ఏమైనా చెయ్యాలిసిన పనపుతే ఉంది. దాని అవసరం, తొందర, అందరూ గుర్తించారు. బాధ్యత ఎవరు తీసుకోవాలా అనేదే సమస్య

అక్రమపు ఆక్రమణలు నగరంనిండా యెన్నో ఉన్నాయి. ఇవి యెన్నో రకాలుగా ఉన్నాయి. కొంతమంది షాపులు కట్టారు. మరికొంతమంది ఇళ్లే వేశారు. వెళ్లమంటే వెళ్లరు. తీవ్రచర్యలు తీసుకుంటే, పెద్ద హంగామా చెయ్యటం; ఈ రభసకు భయపడో, లేక అహింసా సిద్ధాంతానికి కట్టుబడో, ఈ అక్రమ ఆక్రమణలను రూపుమాపటానికి వెనకాడటం కూడా జరుగుతోంది. భూమి మీదకు ఒరుగుతానన్నట్టు, అనుక్షణం భయపెడుతూ, తలకు మించిన బరువును మోస్తూ, ఊగిసలాడుతూ ఉన్న కొన్ని కొన్ని పురాతన కట్టడాలు యింకా అట్లాగే ఉండిపోయినాయి. వాటిని ఛేదించడానికి ధైర్యం చాలటంలేదు. ఎన్నో అడ్డంకులు ! ఎన్నో సమస్యలు! ఇక ఆరోగ్యశాఖవారు ఉండనే ఉన్నారు. కల్తీ ఆహార పదార్థాల విషయంలో గట్టిచర్యలు తీసుకోవటంలో గాని, పట్నాన్ని పరిశుభ్రంగా ఉంచటంలో — నిర్మొహమాటంగా ప్రవర్తించటంలో గాని, వారికి తగిన అధికారాలు, వాటికి తగ్గట్టు, వారికి తగిన రక్షణలు ఉన్నట్టు కనిపించవు. ఏమి చేస్తే, ఎవరికి తగులుతుందో, ఎవరు ఏ రకంగా వత్తిళ్లు తెస్తారో అనే భయం వాళ్ల మనస్సుల్లో లేదని అనటానికి వీల్లేదు. సరస—ధర విక్రయశాలలు యేర్పాటు చెయ్యాలని, వీటిలో మందుల షాపులుకూడా ఉండాలని మునిసిపాలిటీ వారి అభిప్రాయం. మందులషాపులు కొన్ని తెరిచారనుకోండి. అయినా, మిగతా వాటిని ప్రారంభించాలంటే, ప్రభుత్వం వారి సహకారం అనుకున్నంత లభ్యంకావటం లేదని ఫిర్యాదు. అయితే ప్రభుత్వం వారే, వినియోగదారుల సహకార సంఘాలు యేర్పాటు చేశారు కాబట్టి, వాటిమీద శ్రద్ధలేదేమో !

తర్వాత, ఇంత పెద్ద పట్నంలోనూ, వీధులకు పేర్లులేవు కదా ! ఈ మధ్య, ఓ పెద్ద మనిషిని శ్రీనివాస్ ప్రశ్నించాడుట, యెక్కడుంటున్నారని. నాంపల్లిలో అని సమాధానం చెప్పేటప్పటికి, నాంపల్లి అంటే సరిపోతుందిటండీ, అది రాజమండ్రీ అంతడుంది. మీరు యెక్కడున్నట్టు అని పరిహాసంగా అన్నాడుట. కొత్తగా వచ్చిన వారవుతే, విశాల హైదరాబాదులో ఇల్లు కనుక్కునేటప్పటికి తల—ప్రాణం తోకకు వస్తుంది. నిర్దుష్టంగా, వీధుల పేర్లు లేకపోవటం వలన, కొత్తగా వచ్చినవారితో పాటు, పాత వాళ్లకీ ఇబ్బందే ! అయితే ఈ పేర్ల విషయంలో కూడా కాస్త ప్రారంభం అయింది. అన్ని విషయాల్లోనూ, ఏవో చేస్తున్నట్టే కనిపిస్తుంది. అయితే నడక మాత్రం మహా మందం. చురుకుగా సాగిపోవలసిన పనులుకూడా మందమే ! ప్రజల సహకారం లేదని ప్రభుత్వంవారు అంటే, ప్రభుత్వం వారి అసమర్థతే ఇలాంటి జాప్యానికి కారణమని ప్రజలనేస్తారు. ఇది మామూలే ! ఏమయినా, పరిస్థితులు మెరుగుపడతాయనే ఆశాభావం వ్యక్తం చేయుటానికి, ఈ నాటికి ఒక అవకాశం కలిగింది.

అజిత్ సింగ్ గారు విశాల హైదరాబాదుకు కమీషనర్‌గా వచ్చారు. ఆంధ్రప్రదేశ్ మొత్తంమీద ఆయన పేరు సుపరిచితమైనదని, వేరే చెప్ప నక్కర్లేదు. విజయవాడలోనూ, విశాఖపట్నంలోనూ, కమీషనర్ పదవిని నిర్వహించి, వారు పడ్డ శ్రమ, కనపరిచిన ఆసక్తి, నిరంతర కృషి, సర్వజన విదితం. ఆ రెండు చోట్ల కంటె, హైదరాబాదులో వారి సమర్థతకు, యెక్కువ సహకారం లభిస్తుందనటంలో తప్పేమీ లేదేమో ! ప్రజలు యెక్కడైనా, మంచి పనులకు సహకరిస్తూనే ఉంటారు. మధ్య, దళారివంటి వారితోనే ప్రమాదం. ఎలాంటి వత్తిళ్లకు లోనుకాకుండా, స్వేచ్ఛగా, నిర్భయంగా, తమ విధులను నిర్వర్తించుకొనటానికి వచ్చిన ఈ సదవకాశంలో, యెక్కువగా ఆత్మ సంతృప్తే కాకుండా పుర ప్రజలకు కూడా, ఇప్పుడున్న అసంతృప్తిని తొలగిస్తారనటంలో అతిశయోక్తి లేదు. పైన చెప్పిన సమస్యలతోపాటు, యెన్నో ఇతర విషయాల మీద కూడా, ఈ కొత్త కమీషనర్ శ్రద్ధ వహిస్తారనుకోవచ్చు.

ఐ. ఎల్. ఎన్. ★

"కంచే చేను మేస్తే గత్యంతరం ?"

"ఓర్పు—మనుషులు మారే సమయం రావాలి"

"అడవిలో పెద్దపులి తన క్రూరత్వం వదలుకుంటుందేమో కాని— అధికారంలో ఉన్న మదోన్మత్తుల మనసులు మారవు"

"మహారాజును నే నెరుగుదును ఆయన జనక మహారి వంటివాడు ఏనాటికైనా నిజం తెలుసుకొని, తన ప్రజల్ని కాపాడుకుంటాడు"

"ఎప్పుడు ? రాజ్యమంతా స్మశానంగా మారినప్పుడా ? వీల్లేదు ఈ దౌర్జన్యాన్ని ఎదుర్కొనవలసిందే"

"నరసింహా !"

"అవును. చిన్నాన్నతోపాటు నేనుకూడ, కత్తి పట్టి ఆ హంతకుల అంతం చూస్తాను"

"బుద్ధిహీనుడా ! కొరవితో తల గోకుకుంటావా ? వాడితోపాటు నీవుకూడా భ్రష్టుడవవడం నా కిష్టంలేదు"

"నాన్నా !"

"ఒకే మాట, మళ్ళీక కలవడానికి వీల్లేదు వాడి విషయం ఎత్తడానికి వీల్లేదు"

"నాన్నా !"

"ఇది నీ తండ్రి శాసనం" (తండ్రి వెళ్లిపోతాడు)

"ఆవేశపడకు నాయనా ! మీ తండ్రి ఆజ్ఞను శిరసావహించు"

"అమ్మా !"

"అంతే బాబూ ! వారెప్పుడూ తప్పునిర్ణయం చేయరు"

# అవీ - ఇవీ - అన్నీ

11— వ పేజీ తరువాయి

ఈ సన్నివేశం రాజ్యలక్ష్మివారి "బందిపోటు" చిత్రంలోనిది ఈ సన్నివేశంలో తండ్రి ధర్మనాయకగా (నాగయ్య) కొడుకు నరసింహాగా (యన్ టి రామారావు), తల్లి అన్నపూర్ణగా (పుష్పవల్లి), ఉన్నారు వాహినీ స్టూడియోలో ధర్మనాయక ఇల్లు—సెట్టువేసి షూట్ చేశారు

ధర్మనాయకుడి తమ్ముడు వీరనాయకుడు (మిక్కిలినేని), సేనాధిపతిచేసే ఘోరక్రూరకృత్యాలతో దేశంలోని ప్రజలు అల్లాడుతుంటారు సేనాధిపతి శూరసింహుడు (రాజనాల) దుష్టచర్యల్లో వీరసింహుని ఇల్లు కాల్చటం—పెళ్ళాం బిడ్డల్ని చంపడం జరుగుతాయి వీరసింహుడు పగబడతాడు అడవిలో గుహలో నివాసం ఏర్పాటు చేసుకుంటాడు రాజభటుల్ని హింసిస్తూంటాడు వీరనాయకుడు

వీరనాయకుడు బ్రతికున్నట్లు ధర్మనాయకుడు, అన్నపూర్ణకు మాత్రం తెలుసు వీరనాయకుడు రాజకుమారి ఆభరణాల్ని దోచుకోబోతాడు. రాజకుమారి అరుస్తుంది నరసింహ రాక అలికిడి విని వీరనాయకుడు పరుగుతీస్తాడు నరసింహ వెంబడిస్తాడు వీరనాయకుడు తన నివాస స్థలమైన గుహకు చేరుకుంటాడు నరసింహకూడ గుహలో చొరబడి వీరనాయకుణ్ణి కలుసుకుంటాడు విషయాలు తెలుసుకుంటాడు. ఆశయం గ్రహిస్తాడు. ఇంటికి వచ్చి చిన్నాన్నను కలుసుకున్నట్లుగా ధర్మనాయకకు తెలియజేస్తాడు. తండ్రి మందలిస్తాడు అతనిని కలుసుకోడానికి వీల్లేదని శాసిస్తాడు అదే చిత్రీకరించిన సన్నివేశం

ఈ చిత్రంలో యన్ టి రామారావు, గుమ్మడి, రేలంగి, నాగయ్య, రాజనాల, రమణారెడ్డి, మిక్కిలినేని, బాలకృష్ణ, రాజబాబు, రావు కోటే, కృష్ణకుమారి, ఇ వి సరోజ, గిరిజ, పుష్పవల్లి, మొదలగువారు నటిస్తున్నారు

మాటలు మహారథి, పాటలు సి నారాయణరెడ్డి, ఆరుద్ర, దాశరథి, కొసరాజు, సంగీతం : ఘంటసాల, ఛాయ రవికాంత్ నిగాయిజ్, కళ : కృష్ణారావు, దర్శకత్వం బి విఠలాచార్య, నిర్మాతలు సుందర్‌లాల్ అండ్ డూండీ.

## "పూ జా ఫ లం"

ఆదోశ పెద్ద జమిందారు ఇల్లు ఆ జమిందారు మనుమడు (నాగేశ్వరరావు), అమాయకుడు ఆడవాళ్ళంటే సిగ్గుపడతాడు అభిమానం ఎక్కువ. చదువుకున్న అమ్మాయి వాసంతి (జమున) అతని జీవితంలో ఆకస్మికంగా ప్రవేశించి పరిచయం ఏర్పరచుకుంటుంది ఆ పరిచయంతో మధు జీవితంలో క్రొత్త వెలుగులు చూస్తాడు

ఈ సన్నివేశాన్ని శంభూ ఫిలింస్ వారి "పూజాఫలం"లోనిది ఈమధ్య వాహినీ స్టూడియోలో చిత్రీకరించారు

ఈ చిత్రంలో నాగేశ్వరరావు జగ్గయ్య గుమ్మడి, రేలంగి, రమణారెడ్డి, మిక్కిలినేని, ప్రసాద్, సావిత్రి, జమున, రాజశ్రీ, యల్ విజయలక్ష్మి, ఛాయాదేవి మొదలగువారు నటిస్తున్నారు

మాటలు డి వి నరసరాజు, పాటలు డా. వి. కృష్ణశాస్త్రి, సి నారాయణరెడ్డి, కొసరాజు సంగీతం యస్ రాజేశ్వరరావు, ఛాయ యు రాజగోపాల్, కళ శేఖర్, దర్శకుడు బి ఎన్ రెడ్డి, నిర్మాత - దగ్గుపాటి లక్ష్మీనారాయణ చౌదరి

## "బొబ్బిలియుద్ధం" రికార్డింగ్

రిపబ్లిక్ ప్రొడక్షన్సువారు తమ చిత్రం "బొబ్బిలియుద్ధం"కై ఈమధ్య భరణీ స్టూడియోలో ఒక పాటను రికార్డు చేశారు. "సేవలు చెయ్యాలే— ఓ పిల్లా ! సేవలు చెయ్యాలే !" అనే పాటను ఆరుద్ర వ్రాశారు సంగీతం యస్ రాజేశ్వరరావు ఈ పాటను పి. బి. శ్రీనివాస్, జానకి పాడారు ఈ పాటను పద్మనాభం, బాలసరస్వతిలతో చిత్రీకరిస్తారు

## "సావిత్రి బోటు-షికారు"

కొడైకెనాల్‌లో సావిత్రి—భర్త జెమినీగణేశన్‌కు ఇల్లు ఒకటి ఉంది దాని పేరు "రెడ్‌లింక్" వేసవి విడిదిగా జెమినీ గణేశన్ మొదటి భార్య పిల్లలతో సహా వెళ్లి ఆ ఇంట్లో ఉంది

కొడైకెనాల్‌లో సావిత్రికి కూడా స్వంత భవనం ఉంది దాని పేరు "సీనా పాణీ" సావిత్రి, ఆమె భర్త జెమినీగణేశన్, కూతురు చిరంజీవి విజ్జి (విజయ చాముండేశ్వరి) కొడైకెనాల్‌కు వెళ్లి "సీనా పాణీ"లో మకాం పెట్టారు ఉన్న నాలుగు రోజులు ప్రతిరోజూ స్వయంగా పడవ జెమినీ విజ్జితో సావిత్రి పడవ షికారు చేసింది.



అనుపమా వారి 'ఈడూ—జోడూ' లో జమున, జగ్గయ్య.

## జానకి

తమిళ కథా నాయికలు చాలా తక్కువ. అనలే లేరు. తెలుగువారే తమిళ చిత్రాలలో నటించి తమిళ సోదరుల ఆదరాభిమానా లందుకొంటున్నారు. "భాగపిరివినై", "భాగ్యలక్ష్మి" మొదలగు చిత్రాలనుండి, "పాలుం పళముం" వరకు వివిధ చిత్రాలలో అనేక రకములైన పాత్రలు ధరించిన జానకి ముఖ్యంగా పేతస్ కేరక్టర్‌కు అందెవేసిన చేయి అని ఉదాహరణగా "అన్నై" చిత్రం గీటురాయని తమిళ సోదరులనడం గర్వించతగ్గ విషయం.

## శివాజీగణేశన్, బి. సరోజాదేవి గుర్రపు పందాలు

శివాజీ గణేశన్‌కు, బి. సరోజాదేవికి వివాహం అయింది. ఆ నూతన వధూవరులు ఊటీకి వెళ్లారు. అక్కడ గుర్రపు పందాలు జరుగుతున్నాయి. చక్కగా ముస్తాబై ఇద్దరూ "చిలుకా గోరింకా" అంటూ గుర్రపు పందాలుకు బయలుదేరి వెళ్లారు. పందెంలో పాల్గొనే గుర్రాలన్నిటినీ చూచారు. ఆ గుర్రంపై పందెం వేయుమని సరోజాదేవి శివాజీగణేశన్‌కు ఆర్డరు వేసింది. శ్రీమతి—మాట దాటకుండా ఆ గుర్రంపైనే పందెం—కట్టాడు.

ఈ సన్నివేశం శివాజీ ఫిలింస్ వారి "పాడుం పరవై" అనే చిత్రానికి చిత్రీకరించారు

## పద్మిని భక్తి

ప్రముఖ నటి— నర్తకి పద్మిని భర్తతోపాటు కన్యాకుమారికి వెళ్లింది. భయభక్తులతో శ్రద్ధగా స్నానం చేసి భర్త డా. రామచంద్రన్‌తోపాటు కన్యాకుమారి దేవాలయంలోనికి వెళ్లింది. తనకంటె ఎక్కువగా తన భర్తకు పేరు ప్రతిష్ఠలు రావాలని పద్మిని దేవుణ్ణి కోరింది. ఇప్పుడున్నదానికంటే పెద్ద పేరు తన భార్య పద్మినికి రావాలని రామచంద్రన్ దేవుణ్ణి కోరాడట.

## తొంభైతొమ్మిది చిత్రాల గిరిజ

గత నెల 29వ తేదీని విడుదలైన రాజరాజేశ్వరి ఫిలింకంపెనీ వారి "ఆప్త మిత్రులు"తో గిరిజ తొంభై ఎనిమిది చిత్రాలు పూర్తిచేసింది. ఈ నెల రెండవ వారంలో విడుదల కానున్న అనురూపావారి "అమరాగం" చిత్రంతో తొంభై తొమ్మిది చిత్రాలు అయినవి. త్వరితగతిని పూర్తి చేస్తున్న రాజ్యలక్ష్మి వారి "బందిపోటు" చిత్రంతో గాని, రవీంద్రఆర్ట్సు వారి "లక్షాధికారి" చిత్రంతో గాని నూరుచిత్రాలు పూర్తి అవుతాయి.

## అక్కినేని నివాసం

అక్కినేని నాగేశ్వరరావు మద్రాసునుండి హైద్రాబాదుకు వ్యాపార నిమిత్తం మకాం మార్చాడు. గత నెల 29వ తేదీని అడయార్‌లో ఉన్న తన స్వగృహాన్ని ఖాళీచేశాడు. ఆ ఇల్లును నటి సావిత్రి కొనుక్కుంది. ఇల్లును ఖాళీచేసి కుటుంబంతో సహా వెళ్లేముందు సావిత్రిని, ఆమె భర్తను పిలిపించి నాగేశ్వరరావు ఇంటితాళాలు అప్పగించాడు. ఆ రోజు మధ్యాన్నం కారులో బయలుదేరవలసింది. ఎండ తీవ్రతవలన పిల్లలతో ప్రయాణం కష్టమని ఆరోజురాత్రి మెయిల్‌కు బయలుదేరారు. స్టేషన్‌కు తన శ్రేయోభిలాషులు వచ్చి వీడ్కోలిచ్చారు.

"మదరాసుకు వచ్చి సుమారు ఇరవై సంవత్సరాలైంది. అప్పటినుండి ఈ మదరాసు నివాసిగా మీ అందరిలో నేనొకడిగా—అందరం అన్నదమ్ములవలె, ఒకే కుటుంబంలోని వ్యక్తులా తిరిగాం. ఈరోజుతో మదరాసు నివాసిని కాకుండా వెళ్లినా, మదరాసుకూ—నాకూ, మీకూ— నాకూ ఎప్పుడూ సంబంధం ఉంది. షూటింగ్‌కు వస్తూనే ఉంటా. మీరందరూ సెలవు యిప్పించండి" అంటూ నాగేశ్వరరావు నమస్కరించారు.

ఇరవై సంవత్సరాలనుండి కలసి ఉన్న వ్యక్తి మకాం మార్చి వెళ్తున్నాడు. ఇటుపై మదరాసు వచ్చినా, వృత్తి రీత్యా రావలసిందే కాని, మదరాసు నివాసిగా వచ్చే అవకాశం లేదుకదా అని స్టేషన్‌కు విచ్చేసిన అభిమానులందరూ బరువైన హృదయాలతో శ్రీనాగేశ్వరరావుకు, వారి కుటుంబానికి వీడ్కోలిచ్చారు.

## అక్కినేని అమెరికాకు

అమెరికా ప్రభుత్వం ప్రతి సంవత్సరం మన భారతదేశంనుండి ఒక కళాకారుణ్ణి ఆహ్వానిస్తుంది. గత సంవత్సరం తమిళ నటుడు శివాజీగణేశన్‌ను ఆహ్వానించింది. ఈసారి మన తెలుగు చలనచిత్ర కథానాయకుడు అక్కినేని నాగేశ్వరరావును అమెరికా స్టేటు గెస్టుగా 60 రోజులు పర్యటించే నిమిత్తం ఆహ్వానించింది.

ఇండియాలో ఉన్న అమెరికా రాయబారి శ్రీ గాల్‌బ్రెత్ మదరాసులో ఉన్న అమెరికా సమాచార శాఖ డైరెక్టర్ శ్రీ "పెజిన్"కు ఈ ఆహ్వానాన్ని నాగేశ్వరరావుకు అందజేయ వలసిందిగా పంపించారు. శ్రీ "పెజిన్" ఈ ప్రత్యేకాహ్వానాన్ని అందజేశారు.

1964 వ సంవత్సరం మార్చి 25వ తేదీ లోగా నాగేశ్వరరావు అమెరికా వెళ్లాలి. శ్రీ నాగేశ్వరరావుకు ఈ ప్రపంచ పర్యటనలో విమాన ఖర్చులు, ప్రతిదిన వసతి సదుపాయాలు, ఇతర ఖర్చులుకూడా—అన్నీ అమెరికా ప్రభుత్వమే భరిస్తుంది. ఈసారి నాగేశ్వరరావును అమెరికా ప్రభుత్వం ఆహ్వానించడం ఆంధ్ర చలనచిత్ర పరిశ్రమ అంతా గర్వించతగ్గ విషయం.

శ్రీ నాగేశ్వరరావు తన కుటుంబంతో సహా హైద్రాబాద్‌కు మకాం మార్చబోయేముందుగా, ఆకస్మికంగా, అమెరికా ఆహ్వానం నాగేశ్వరరావుకు శుభ సూచకం.

ఈ అమెరికా పర్యటనలో వెళ్లేటప్పుడు, వచ్చేటప్పుడు మార్గ మధ్యమున ప్రతి ముఖ్య దేశములో నాగేశ్వరరావు ఒకటి రెండురోజులు ఆగవచ్చు. హాలివుడ్‌లో రెండు— మూడు వారాలుండి విషయాలు తెలుసుకోవచ్చు. అమెరికాలో ఉన్న స్నాతకోత్సవాలా సభలు— సమావేశాలు, ఇతర ప్రకృతి దృశ్యాలు తిలకించడం వగైరా కార్యక్రమం అంతా స్టేట్ లెవెల్‌లో చాలా భారీగా అమెరికా ప్రభుత్వం చేయొచ్చు.

## ముఖ్యమంత్రి ఇంట్లో వివాహానికి హాజరు

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి డా. నీలం సంజీవరెడ్డిగారి కుమార్తెకు హైద్రాబాద్‌లో వారి నివాసస్థలమైన "గ్రీన్‌లాండ్స్"లో గత నెల 27వ



'కొడుకులూ కోడళ్లు'లో రాజమ్మ.

అతి వైభవంగా వివాహం జరిగింది. వివాహానికి మంత్రులు, అధికార, అనధికార ప్రముఖులందరూ విచ్చేసి వధూవరులను ఆశీర్వదించారు.

నాగేశ్వరరావు 26వ తేదీని షూటింగ్ ముగించుకొని మదరాసునుండి విమానంలో బయలుదేరి హైద్రాబాద్ చేరాడు. మరునాడు శ్రీ సంజీవరెడ్డి ఇంట్లో వివాహానికి హాజరై శ్రీ సంజీవరెడ్డిని కలుసుకొని, వెంటనే విమానంలో బయలుదేరి మదరాసు చేరి శంభూఫిలింస్‌వారి షూటింగ్‌కు హాజరైనారు.

సి. డి.

* * *

## వివాహాలు

తక్కెళ్లపాడు కరణం శ్రీ కొ్రటపాటి వెంకటసుబ్రహ్మణ్యం తమ కుమారుడు శ్రీ కె. సుబ్బారావు ఎం.ఏ. (ఆంధ్రసచిత్ర వారపత్రికలో—సబ్ ఎడిటర్) కు శ్రీ అబ్బూరి రామసుబ్బారావు (నాజర్‌పేట) గారి కుమార్తె సౌ॥ శ్రీ భారతీదేవి నిచ్చి వైభవంగా వధువు యింట తెనాలిలో జూన్ ఒకటో తేదీ రాత్రి వివాహం జరిపించారు. మిత్రులు బంధువులు వచ్చి వధూవరుల నాశీర్వదించారు.

* * *

డా. అచ్చమాంబ, శ్రీ వెంకట్రామశాస్త్రిగారలు తమ కుమార్తె చి. సౌ. లక్ష్మీటాన్యాను, చి కృష్ణమూర్తి ఎం. ఏ. ఎల్. ఎల్. బీ. కి ఇచ్చి, విజయవాడలో మే 30 వ తేదీనాడు వివాహము వైభవముగా జరిపించారు.



# ధూమపానం

27—వ పేజీ తరువాయి

● బ్రిటన్‌లో మనిషికి, సంవత్సరానికి సుమారు 2,500 సిగరెట్లు ఖర్చు అవుతాయి. అమెరికాలో అంతకన్నా కొంచెం ఎక్కువ కాలుస్తారని తోస్తుంది. మన దేశంలో మనిషికి సుమారు అయిదు వందల సిగరెట్లు ఖర్చు అవుతాయని తెలుస్తుంది ఈ లెక్కలన్నీ మొత్తం సిగరెట్ల ఉత్పత్తిని జనాభాతో విభజించగా వచ్చినవి అంటే, పొగ త్రాగని వారిని లెక్కలోకి తీసుకోలేదన్నమాట సిగరెట్ల అలవాటు ఉన్నవారి సగటు సంఖ్యలు పై సంఖ్యలకు కొన్ని రెట్లు అధికంగా ఉంటాయి!

● ఇక్కడ వివరాలు పూర్తిగా తెలియవుకాని, బ్రిటన్‌లో ప్రతి సిగరెట్ వెలలోనూ సుమారు 83 3% ప్రభుత్వం పన్నులకే సరిపోతుంది! భారతదేశంలోనూ పరిస్థితి చాలావరకు ఇలాగే ఉంటుందని వూహించవచ్చు.

● ప్రపంచం మొత్తంమీద సుమారు 600 కోట్ల పవున్ల పొగాకు పండిస్తారు. ఇందులో ఆరవ భాగం చైనా వంతు.

● కాని, అమెరికా ఆరవ వంతుకి సరిపోయే భూమితో—పొగాకు పండించే భూమి అన్న మాట—దగ్గర దగ్గర మూడవ వంతుకి సమానం అయ్యే పంట పండిస్తుంది.

● కామన్వెల్తు దేశాలన్నీ కలిపి సుమారు మూడవ భాగం పొగాకు పండిస్తారు. భారతదేశంలో ఎకరానికి ఎంత ఉత్పత్తి అని ప్రశ్నిస్తే, తక్కిన దేశాలకన్నా చాలా తక్కువ అని సమాధానం ఇవ్వవలసి వస్తుంది!

● భారతదేశం చేసే మొత్తం పొగాకు ఎగుమతిలో బ్రిటన్ సగం దాకా కొంటుంది కాని, దీనివల్ల మన విదేశ ద్రవ్యాదాయం (మొత్తం సంఖ్యలో) సుమారు 1 5% మాత్రమే మరొక విధంగా చెప్పాలంటే, పొగాకు మన ఎగుమతుల విలువలో 3% మాత్రానికే వస్తుందన్నమాట.

● సిగరెట్లు కాల్చి, జబ్బువేసి కార్మికులు పని మానెయ్యటంవల్ల ఏటా బ్రిటన్‌కు సుమారు 20 కోట్ల రూపాయలకు తక్కువ ఉండదుట (అయితే, ఇది కేవలం దగ్గుకి సంబంధించినంతవరకే. కాన్సర్ బాధలు వేరే.)

● వచ్చే పది సంవత్సరాలలో ప్రతి 1000 మందికీ సిగరెట్ కాల్చేవారిలోనూ కాల్చని వారిలో కంటే 5 మంది ఎక్కువగా మరణిస్తారని అంచనా వేశారు.

● అసలు సిగరెట్లు కాల్చటంవల్ల బ్రిటన్‌లో మొత్తం 1000 కోట్ల రూపాయల పైన నష్టం వస్తూ ఉందిట ప్రతి ఏడాదీ. కాని వారందరూ సిగరెట్లు మాని వేస్తే ఇంత మొత్తం కలిసి వస్తుందనికాదు.

● సిగరెట్లు వెలలో చాలా భాగం ప్రచారానికే సరిపోతుంది కాబట్టి ప్రచారం నిషేధించి, వెల తగ్గించవచ్చని కొందరిసూచన! ★

Edited, Printed and Published by S Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street Madras-1. Chief Editor. S. Sambhu Prasad.

Regd No. 4479 ANDHRA SACHITRA VARA PATRIKA.



కల్పన